శ్రీ మీనాక్షీసహిత సుందరేశ్వరాయనమః.

# విషాదకనకతారకీయము.

విద్వాన్

## ములుగు చంద్రమౌళి శాస్త్రిచే

రచియింపఁబడినది.

ప్రకాశకులు.

కె. కె. పట్నాయక్ & బ్రదర్స్

బుక్ సెల్లర్సు ఏలూరు, కృష్ణాజిల్లా.

మొదటికూర్పు 1000 ప్రతులు.

రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

సెప్టెంబరు 1923.



వెల రు 0-14-0.

# ఈనాటకమునందు వచ్చుపాత్రలు

## పురుషులు.

సూత్రధారుఁడు
వీరసేనుఁడు—(కనకశేఖరుని తండ్రి)
ధీమంతుఁడు—(వీరసేనుని మంత్రి)
ప్రతాపుఁడు—(వీరసేనుని సేనాని)
రుద్రదేవుఁడు—(ఒకరాజు)
ధీవరమంత్రి—(రుద్రదేవునిమంత్రి)
కనకశేఖరుఁడు
విష్ణుఁడు
కంచుకి
ప్రాడ్వివాకుఁడు—(న్యాయవాది)
శోధనకుఁడు—(న్యాయమును విమర్శించువాఁడు)
యాకూబ్—(కూటసాక్షి)
ధనగుప్తుఁడు—(కోమటి)
పేరుసెట్టి—(నేరమును కనిపెట్టినవాఁడు)
రామసింగు—(విటుఁడు)
భీమదాసు—(ఒక గృహస్థుఁడు)
మతిమంతుఁడు—రుద్రదేవుని పెద్దమంత్రి
కొందరు పౌరులు

## స్త్రీలు.

నటి
చారుమతి—(వీరసేనుని భార్య)
తారావళి—(వీరసేనునికూతురు)
రాధ—(భీమదాసునిభార్య)
రదనిక—(అంతఃపురపరిచారిక)

శ్రీమీనాక్షీసహిత సుందరేశ్వరాయనమః.

# ఇష్టదేవతా ప్రశంసనాదికము.

చ. శ్రితజన రక్షణాభిరతిఁ జేసి నిరంతర వాసమైన ప
ర్వతమునను న్వీడి మధురాపురముల్ శ్వశురాలయంబుగా
సతము వసించి మాదృశుల సన్నుతిఁ గైకొను సుందరేశుఁడీ
కృతికిఁ ఱేఁడై కుశీలవులకిష్ట శుభప్రతతి పాదియయ్యెడున్.

మ. తనకారుణ్యము లోకసౌఖ్య ఘటనోద్యత్కారణంబై తగన్
దనసాంగత్యము సుందరేశ్వరున కత్యంతంబు మోదంబుగాఁ
గను శ్రీ మన్మధురాపురంబున జగత్కళ్యాణ సంధాత్రియై
యనయంబుల్ వసియించు భద్రదను మీనాక్షిన్ మదిన్ గొల్చెదన్.

చ. నిముసమాయేని మిమ్ము విడనేరక గన్నులగప్పికొంచు స
క్రమమగు శిక్షచేత సుకరంబగు శాస్త్రము నేర్పరించె బు
ణ్యమతి యతండు మాకుఁ బితనందయ సూరివరేణ్యుఁ డస్మదీ
యమగుఁ గవిక్షమెల్ల కడలందు వెలింగెడి నట్లొనర్చెడున్.

ఉ. నేరనివాఁడనై చదువు నేర్పెడి యోజ్జలసహ్య మొందగా
వారల వీరలన్ గలసి వాదము లాడుచు సంచరించు న
న్నారసి చేరఁదీసి యనయంబు శ్రమంపడి విద్యనేర్పి మా
భైరవమూర్తి సద్గురు డపారకృపా కలితుండుగాఁడొకో.

తే. తనకు ఛాత్రులయెడఁగల దయనుజూప
సకల శుభలక్షణావతం యగుఁ గవిత
నాకొసంగెను ముదిగొండ నాగలింగ
శాస్త్రిగారికి నానమస్కారశతము.

చ. నను గనినప్పుడెల్ల వదనంబునఁ జిర్నగవంకురింప ర
మ్మని తనయుం డొకర్కుఁ జేర్చి శుషమారయు నాతని వీరభద్ర శా
స్త్రిని దయతోడ నాదగుఁ గృతిన్ విమలంబగునట్లు సల్పుఁగా
ననయము వేడికొందుఁ బరమాప్తుఁడు గావునఁ గౌతకంబునన్.

తే. చాలశ్రమఁ జేసి నాప్రభు లింగలీల
నచ్చు వేయించె మామిడే లాన్వయాబ్ధి
హిమకరుండన వెలయు వీరేశలింగ
మెపుడు నాకట్టి మిత్రుఁడై యొనఁగుఁగాత.

శా. ఏనల్పజ్ఞుఁడనౌట నాకవితయందే దోషముల్ గల్గినన్
వానిం బోకడఁబెట్టి యీకృతియె యానందంబుతోఁ గన్గొనన్
దీనై పుణ్యము వేడికొందు నవరేనిన్ బీనవత్నో జన
మ్మోనూనాంగిని గౌరవంబుమెయి నిత్యంబెత్తి ముద్దాడరే.

విద్వాన్ ములుగు చంద్రమౌళిశాస్త్రి.



శ్రీ

మీనాక్ష్యైనమః

# విషాదకనకతారీయము.

నాంది.

చ॥ క్రమ మెడలించి దుష్టుఁడయి కాముకవృత్తివహించి నీచ మా
ర్గము దలఁపూని సాధుజనగర్హితుఁడౌ కులపాంసురు సమూ
లముగ నశింపఁజేసి బుధులన్ గృపఁగాచు ననింద్యమైన ధ
ర్మము సకలార్థ సాధన పరంపర మీ కొనగూర్చుఁ గావుతన్

సూత్రి:—(అనంతరముఁ బ్రవేశించి) ఆహా సకలకళాపరిశోభితంబును బండితప్రకాండ మండితంబునగు నీ పరిషత్తలంబల్పజ్ఞుఁడనగు నన్నాదరించుటకు మదీయపూర్వ సుకృతపరిపాకంబున ననియే తలంచవలసియున్నది. (పరిక్రమించి ఆకసమువంకఁజూచి ఆశ్చర్యముతో) ఏమి నా యల్ప సంతోషము. ఇల్లలికి నంతనె పండుగయగునా, నా ప్రదర్శింపఁజోవు రూపకమున నీ నియోక్తల రంజించినఁగదా సంతస మందవలయును.

తే. ఎవ్వఁడేకార్య మొనరింప నెలమిఁబూను
నాతఁడాకార్యము ఫలించు నంతవఱకు
నోదగియుండఁగఁ దగుఁగాక యూరకిటుల
నల్పసంతోషమును జెందనగునె ఫలము.

అవును నే నీ గుణగ్రహణ ధురీణులు తమననునంతవఱకు జాగ్రతగ నుండవలయును. (ముందునకు నడచి) ఔరా కాలచక్ర

కెన్నిరీతులఁ బరుగెత్తుచున్నది. నాకు దొలుత గలిగిన సంతోషమెల్ల భయంబుగ మారుచున్నదే. రసికజన పరీతమగు నీ సభాతలంబున నెట్లు మాట నిలుచునో తోఁచకున్నది.

(ఆలోచించి) అవును నిజమే.

తే॥ మంచి పొలమైనచో విత్తులుంచువాఁడు
బాలిశుండైనఁ బంటలు పండకున్నె
పెరులెల్లను జల్లెడి వానిగుణము
స్వీకరింపవుగా దె పృథ్వీతలమున.

కావున నాకార్య పరిసమాప్తికై విచారము వలదు. (తెఱవంకఁ జూచి) ఏల నీ యతి విస్తరము.

నటి:—(ప్రవేశించి) ఆర్యా ! ఇదె వచ్చితిని.

సూత్ర:—ప్రేయసీ ! స్త్రీజన స్వభావమగు కాలస్వామింక నైన నిన్ను విడ లేదుగా.

నటి:—ఆర్యా ! ఆగ్రహింపకుఁడు దుష్టమతులకృత్యంబులకుఁ గాల చక్రముగూడ విపరీతమగునను విషయముఁగూర్చి నా సఖితో ముచ్చటించుచుండుటచేత నింత విలంబమైనది.

సూత్ర:—అయిన దానికేమిగాని యేతన్మహాకార్య సంఘటనమునకై నీ సాయము గోరవలసి వచ్చినది.

నటి:—సకలకార్య సాధన కుశలురగు మీకీ యబలసాయము జేయఁ దగినంత చతురతయా, నాయందలి వాత్సల్యము మిమ్మిట్లనిపించు చున్నది. కాని అది యేమికార్యము?

సూత్ర:—నిఖిలశాస్త్ర పారంగతులగు నీ సామాజికులెల్లరు సుంద రేశ్వరోత్సవారంభమున నేదియేని యొక నాటకము ప్రదర్శ

గింప నా కాజ్ఞయిడిరి. వారికి నీయందలి విశ్వాసమున నియ్యకొంటిని. కాన నిప్పటి వసంతర్తువును గుఱించి యించుక గానము జేయుము.

నటి:—ఆర్యా! మనము ప్రదర్శింపఁదగినదే నాటకము?

సూత్ర:—అది విషాద కనకతారీయమను నైదంకముల నాటకము.

నటి:—దాని నెవరు రచించిరి.

సూత్ర:—

సీ. కృష్ణానదీకుల్య తీరమౌ తెన్నాలి
పుర మనయంబు గాపురము గాఁగ
పులిపాక భైరవమూర్తిసద్గురుపాద
కమలముల్ వందనీయములు గాఁగ
సనకాదిమౌని ప్రాజ్ఞజనజ్ఞ దక్షిణా
మూర్త్యుపాసనమె సమ్మోదము గాఁగ
సకలదిగ్దేశ నాయక సమర్పితము కా
బిరుదముల్ వెలలేని సరులు గాఁగ

తే. సకలవిధ కావ్యనిర్మాణ చతురుఁడగుచు
సాటివారలలోఁగడు మేటియగుచు
నెసఁగు మన ముల్లు చంద్రమౌళీశ్వరుండు
కర్తయైయొప్పు నారూపకమునకబల.

నటి:—బాగు బాగు. ఆనాటకము నేడు ముఖ్యముగాఁ బ్రయోగింపఁ దగినదే. ఇదే నా సంగీతముచేత సామాజికుల కుల్లాసముఁ గలిగించెద.

లయగ్రాహి. కోకిలలు మావి చిగురాకులను మెక్కి యల
వోకొకఁడొకండు వెనఁ బైకొనుచు నుండన్

మూఁకలుఁగ జేరి పలుపోకలుగఁగీరతతు
లాకసయివెంట నెగఁబ్రాకుచు ధ్వనింపన్
వాకజలజాకరము శీకరములె త్తిపాలి
పోకమలయానిలుఁడు పైకెగరజిమ్మన్
శ్రీకరవసంత కుసుమాకరము లోకహిత
మైకనఁగొనం గనులకేకసుఖమిచ్చున్.

మఱియును:

తే. అగ్రజన్ము నివంచించి యతనికొంపఁ
గోలఁగాఁ జేసి దుష్టునిలీలమంచి
నడతలేకవియోగ ఖిన్నలగు సతుల
నేచ యత్నించు దర్పమందీదినముల.

సూత్ర:—అనన్యసామాన్యమగు నీసంగీతము మామకమనంబునపహ రించుటయాగాక సభాసదుల వదనారవిందముల వికసింపఁజేసిన ది. ఇఁక నాలసింపక మనమేగి పాత్రములనాయత్తపరచుదము రమ్ము.

నటి:—అదిగో ధనలుబ్ధయై కౌటిల్యమువహించి యందఱను మోసించు తన స్వభావమును వార్ధకంబునఁ గూడ విడనాడ నంచరించు రదనిక కాలియులికిడి వినవచ్చుచున్నది. పోవుదముపదుఁడు మనమిందున్నచో దానికౌటిల్యాస్త్రంబునకు గుఱిగాఁగలము.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావనము.

---

శ్రీ

మీనాక్ష్యైనమః

# విషాదకనకతారీయము.

## ప్రథమాంకము.

ప్రవేశించి:— నేను పుట్టిననాటనుండియు నీ వీరసేనమహారాజు గారి యంతఃపుర పరిచారికలలోఁ బేరుపడి రాణివాసములకుఁ దగ్గఱబంధువువలె మన్నింపఁబడుచుఁ దలలోనాలుకవలె నుంటిని. ఇప్పుడు నాకు వార్ధక్యము సంభవించుటచేతను చారుమతీదేవికిఁ బుట్టినింటివారు పరిచారికల నరణముగా నొసఁగుటచేతను మున్నువలె నంతఃపురమునకుఁ బ్రవేశించుటకును వీలు గలుగదయ్యె. ఎల్లకాలముఁ గాల మొక్కరీతిగ నుండదుగదా. ఎట్టివారికిని శరీరసత్వ ముడిగినవారలయెడఁ బనియుండదు. కనుకనే చారుమతీదేవి నన్ను కన్నెత్తియైనను జూడనొల్లదు. నే నామె కే యపకారమొనరించితినో తెలియదు. పోనీ ఆమెకు నాయందభిమానము లేకున్న నేమి నాకువలసినదిధనముగదా. ఏవిధంబుననైన దుష్టబుద్ధిని నామాయలోఁబడవేసి వలసినంత రొక్కము నార్జింపకుందునా? ఇప్పటివారెందరైనను నాకాలి గోటికైనను సరియగుదురా!

చ. తపమొనరింపవచ్చునె నిదాఘదినంబులలోన నగ్ని మ
ధ్యపదమునందుఁ జేరి గిరిపైనఁ బ్రయత్నమునన్ దృణంబుగా
నపుడె యొనర్పఁగానగు నహో ధనముల్ గణియించు టేరికే
కపటముఁబూనినన్ వలనుగాదుగదా ధరలోన నెప్పుడున్.

అందువలననే చాల దినములనుండి యనేక కష్టములకోర్చి ధ మార్జించు నుపాయము నానహాధ్యాయిగాఁ జేసికొంటిని. నాయూహకినను లోఁగనివాఁడెవఁడు ఈదుష్టబుద్ధియొక్క తెక్కలియా. కావున నీ యిఁచివక డిచి త్తరువు నతిజాగ్రతతో సంపాదింపవలసివచ్చినది. అహా చారుమ్మభవించు దేవి చక్కఁదనమేమనివర్ణింపవలయును. కనుకనే యా యింతి పై మెట్ట ష్టబుద్ధి మరులుజెందియున్నవాఁడు. దుష్టబుద్ధి యెట్టికార్యము నొన నను జారుమతీ దేవి మనసుమాత్రము చలించదు. (కొంచెమాలోచిం ఏమైననేమి నాకుఁగావలసినది ధనముగదా. కావున దుష్టబుద్ధికొత్తుల పోవలయును. (అని పరిక్రమించును)

దుష్ట:—(ప్రవేశించి) (తనలోఁదలయూచుచు) ఇదియా వీరియాలోన్నందు
నము. గుబివెంద తన నల్పైబుఁగనటులఁ దామొనరించుఁ
ర్యముల ముచ్చటింపకయుహరహంబు నాపైనేరములనే వెద
చుందురుగా! సహస్రభానుని తేజంబు సహింపలేక డాఁగియుం
దివాంధమువలె మదీయ సాహసౌదార్యంబులకోరువక పిరికి
రై చాటునఁ గొణఁగికొన నేమిలాభము. నే నేదియేని య
ర్యంబుసల్పిన నాయెదుటమాటాడరాదో. (ఆలోచించి) ఏవి
నేఁజేయునది యకార్యమా? ఇఁక సత్కార్యములెట్టివి? పు
షుఁడై యుదయించినందులకు లోకోత్తరకార్యంబుల నొన
కున్న నేమిలాభము? అబలలవలె నస్వాతంత్రము పౌరుషవం
నకుఁదగునా?

తే. అగ్రజుండైనఁ బిత యైన నప్తయైన
నెవ్వరైనను దమకప కృతినొనర్ప
దలఁతురవ్వారి దండింపఁ దగునటండ్రు
తనకుమాలిన ధర్మంబు ధరణిఁ గలదె

కావుననే నేకోదరులమని యైన విచారింపక మదీయప్రాణాపాయ
మునకు సమకట్టిన తదనుయాయులను వీరసేనుని వధింపవలసినదే.

మ. హరుఁడో వెన్నుఁడొ పద్మసంభవుఁడొ దైత్యారాతియో లేక య
శరజన్ముండొ మదీయకోపదహనజ్వాలంబడఁ బోవు భూ
వరుధీమంతుఁ బ్రతాపునిన్ గరుణఁ బ్రోవన్ గంకణంబూనినే
డరు దేరవ్వలె గాక యన్యులకు సాధ్యంబౌనె నన్నోర్వఁగన్.

(అంతటను గలయఁజూచి) ఏమది చిత్రపటమును గొనివత్తు
చెప్పిన రదనిక యింకను నాలస్యమునే చేయుచున్నది. కారణమే
యుండును.

రద:—(దుష్టునిగాంచి) మహారాజా జయము జయము.

దుష్ట:—(రదనికను జూచి) రదనికా సఫలప్రయత్నము గలదా
గదా. ఏదీ చిత్తరువు?

రద:—అయ్యా! ఇదే చూడుఁడు. చారుమతీదేవి సోయగమె
జితింపించుటకుఁ దగిన సాధకములు లేమి యేదో యొక్క
వ్రాసి తెచ్చితిని. (అనియిచ్చును.)

దుష్ట:—(చిత్తరువునందుకొని) సంతోషముతో రదనికా నీ
యుపకారమున కేమి ప్రతిసేయుదును. తడవుకాలమును
యేలావణ్యవతికై తనుధనంబులు జీర్ణింపఁ గష్టములనొం
చుంటినో యావరారోహా సౌందర్యము గానిపించి నా
గుతూహలము గలిగించితివి. (అని తనచేతికడియము నిచ్చు

రద:—(కడియమందులోని కన్నుల నద్దుకొనుట)

దుష్ట:—రదనికా! నీకా! గుబ్బెత రూపము లిఖించుటకుఁ దగిన సాధకములు దొరుకలేదా? చారుమతి కింతకన్న నెక్కుడు చక్కఁదనము గలదా నిజమేకదా అయ్యో నాదురదృష్టము నకు నీవేమి సేయుదువు. (ఇంచుక నిదానించి) ఓసీ నీవీచిత్త రువు వ్రాయుటెందు నేర్చుకొంటివి? నాజీవితకాలములో నిట్లు ఛాయాపటముల వ్రాయు నీవంటివారలఁ జూడఁగలనా?

రద:—మహారాజా! ముదిమదిఁ దప్పిన నేను సాధకములులేమి కక్కుఱితికొల్లో వ్రాసిన యీపటమునకే యింత పొగడుచుంటిరి మా యుపాధ్యాయుచే వ్రాయఁబడిన పటములఁ జూచిననెంత విస్మయమందుదురో గదా!

దుష్ట:—నామాట వినిపించుకొనలేదా, అట్టినేర్పుగల మహానీయురా లెవరో చెప్పి నా కుత్సాహము గలిగింపుము. ఆమెను దర్శింప దగినచో నాకన్నులఁ బవిత్రముగఁ జేసికొందును.

రద:—(స్వగతము) మంచి మార్గమునే త్రొక్కుచున్నాఁడు. వీనికిఁ జారుమతియందు మఱింత మోహము గలిగించినా దారిద్ర్య దేవతనిప్పుడే తొలఁగించుకొందును. (ప్రకాశముగా) రాజా! సంగీతసాహిత్యములు స్తనములుగాఁగ భరతశాస్త్రము మెల్ల మెల్లని నడలుగాఁగ దనకన్న సౌందర్యవతులు ముజ్జగంబుల లేరని పొగడఁ బడుచుండి తదితర కళలెల్ల నవయవములుగా నుండ (చిత్తరువును జూపుచు) నీహృదయమును గౌఁగిలించిన యీ మత్తకాశినియే మాయుపాధ్యాయు

దుష్ట:—(ఆశ్చర్యముతో) ఏమీ చారుమతి మా గురువు ఎన్న

రద:—ఏమి యిది. క్షణములో నింత దైన్యము నొందుచున్నావు.

దుష్ట:—కుమ్మరసారెలాగునఁ గాలచక్ర మొక్కపరి దిరుగుచుండఁ
దైన్యముగా నెట్లుండును.

రద:—ఎట్లు.

దుష్ట:—ఆ. తమ్ము గుఱ్ఱయనుచు దయయొదఁగలనైనఁ
బిలువకున్నఁగాని పేర్మినెడక
యున్న ననుసరించు చనయుంబుదీనుని
వలెఁ జరించుచున్న వాఁడనుగద.

రద:—అవును నిజమే.

దుష్ట:—అట్టి మాయన్న దుర్మార్గులగుఁ గొందఱ దుర్బోధలవలన
నన్యాయముగ దండింపఁ దలకొన్న వాఁడు.

రద:—(ఆతురతతో) అదెట్లు.

దుష్ట:—క. తనకరవాలము కెఱగా
నొనరింపఁ దలంచి యుగ్రుఁడో యనఁ గ్రోధా
రుణితనయనుండగుచు నా
జ్ఞనొసంగె భటునకురదని కానను బట్టన్.

రద:—పాపము శమించుగాక. సోదరుండనియైనఁ గనికరము లే
యెంతపని జేయ సాహసించెను- నీవు చాగునుతిం గోరితివి
తెలియలేకుగదా-దానికిఁ బ్రతిని వేమి చేయఁదలంచితివి.

దుష్ట:—చేయుటకేమి గలదు. అతనిదిగదా యధికారము.

రద:—అట్లని తన ప్రాణములఁ గోల్పోదురా. ఏదేని ప్రతిక్రియ
వల్సి రానున్న బాధను దప్పించుకొనవలయుఁగదా-

దుష్ట:—నాకేమియుఁ దోఁచుటలేదు-

రద:— బాగుగా నాలోచించిన నెట్లు దోఁచకుండును-

దుష్ట:— నాకుఁ దోఁచిన విషయము దెల్పెదను విని యుక్తాయుక్తము లెఱింగింపుము. "తనకుమాలిన ధర్మంబు ధరణిఁగలదె" అన్నట్లు ప్రతివారికిని దమ ప్రాణము రక్షించుకొనుట ప్రధానము గదా! అందువలన నన్ను బంధింప నమకట్టిన వీరసేనుని బంధించి పాతాళగృహమున నుంచుటయుఁ దక్కినవారలఁ జంపుటయు నాయుపకారము దొలంగఁజేయునని యెంచితిని.

రద:— అట్లు జరిగెనేని నీ శత్రువుల పన్నాగంబు వ్యర్థమగుట యేగాక మన ప్రాథమికోద్దేశ్యముగూడ ఫలించుననియా నీయభిప్రాయము

దుష్ట:— అవును.

రద:— బాగుగా నాలోచించితివి కాని యిందొక సందేహము బొడముచున్నది. ఏమందువా చిరకాలము నుండియు పౌరులను తన బిడ్డలను పోల్కి రక్షించుచుండు వీరసేన మహారాజుగారిని బంధించినచో నెల్లవారును నీయందసూయఁ జెందుదురు.

దుష్ట:— దాన నాకు నష్టమేమి.

రద:— దాన నీకు రాఁబోవుకష్టము చెప్పనలవిగాదు. పౌరులందఱును రాజుగారి నతికష్టమునకైన విడదీతురు ఆమీఁద మీయన్నగారు నీపైన నిదివఱకుఁగల గోపమునసే గాక తనను బంధించితివను గ్రోధమునఁగూడ నిన్ను జంపఁగలండు. దానికన్న వేఱు కష్ట మేముండును.

దుష్ట:— అట్లయిన సమిత్రంబుగ వీరసేన మహారాజును యమలోకంబున కంపి చారుమతితోఁగూడ రాజ్యలక్ష్మిని పాణిగ్రహణము జేయుదును.

రదని:—(స్వగతము) ఓహో యీదురాత్ముఁడు ప్రాణహాత్యకుఁ గూడ వెఱవనట్లున్నాఁడు. వీఁడెంతకైన సాహసుఁడే వీని నీ ప్రయత్నమునుండి తప్పింపఁ జూచెదను. (ప్రకాశముగా) బాబూ లోకమునం దెవ్వరైన సోదరులయెడ గౌరవభావంబుఁ జూపుదురుగాని నిష్కరుణులై చంపఁజూతురా? పోనీ క్షత్రియునకు దోషంబు లేదందువా.

ఉ. పౌరుషశాలివైన నరపాలకుఁ డాజి నెదిర్చి భీకరా
కారమునన్ ద్విషత్ర శరకాననము న్దెగఁగూల్పఁ గావలెన్
నేరక యివ్విధిన్ గడఁగి నిద్దురఁ గూరెడివారిఁ జంపఁగా
శూరులు మెత్తురే యముఁడు చూచి • సహించునె మేలుగల్గునే।

అదియుంగాక

తే॥ ధర్మమును దాన నాల్గు పాదముల నిల్పి
జగము నేలెడిఁ దన యగ్రజన్ముఁ జంపెఁ
జెనఁటి యగుచును దొలి దుష్టచిత్తుఁ డనుచు
జనులు నిసబ్రువ్వఁ దిట్టరె సంతతంబు।

కావున రణంబుజేసి శత్రువులఁ గూల్చుట శ్రేయంబగును. రాజ్యలక్ష్మియు నిన్ను వరించఁగలదు. మఱియు నీచరాచర ప్రపంచము ముందువఱకు నీయశము హరిశ్చంద్రాది మహీపతుల యశంబును గప్పియనింద్యమై యలరారఁగలదు.

దుష్టు:—కీర్తియేకాని యపకీర్తియేకాని రాజ్యముండనీ పోనీ ఏ యెట్లైనను నా కపకారము జేయఁదలంచిన యా దుష్టుల జంపుటొండె వీరసేనుని బంధించుటొండె కావలయును. ఈ రెండు పద్ధతులందు నీకేదిహితమో తెలుపుము.

రద:—ఈరెండు తెఱంగులకన్న వేఱొం డూహించఁగూడదా.

దుష్ట:—ఇవిగాక దేనివలనను నాయుద్దేశ్యము ఫలించదు.

రద:—అట్లయినచో కాలచక్రము తిరుగు తీరున నెల్లప్పుడును నడువదుగదా. ఏనాటికెట్లు నీబుద్ధి మారునో నీకును దెలియదు. అందువలన మీ యన్నగారిని పాతాళ గృహమున బంధించి యెవ్వరికిని దెలియకుండునట్లు జేయుట మంచిది.

దుష్ట:—ఇదియే మంచి యుపాయము.

రద:—ఈపని యితరులకుఁ దెలియఁ దగినది కాదు. రహస్యముగాఁ జేయవలయును.

దుష్ట:—అవును నిజమే.

రద:—ఇందునీకు సాయమెవరు. మంచి సమర్థులు గావలయునే?

దుష్ట:—ఈవిషయ మిదివఱకు వీరకేతునితో నాలోచించియే యుంచితిని.

రదని:—మంచిపని చేసితివి. నీపంట బండినట్లికాని నన్ను మాత్రము మరువవలదు.

దుష్ట:—అట్లు జరుగునని కలనేని తలంపకుము. (అనినిష్క్రమించును)

రద:—ఎంతలో నెంత జరుగవలసి వచ్చెను. అహా ఇరువురుఁ జంపుటయు విష్ణ్వంశ సంభూతుఁడునగు భూపాలునధోలోకంబున బంధించుటయు సాధ్వీమతల్లిని జెఱవట్టుటయునా ఇందువలనఁ గలుగు పాప పుణ్యములు నేనుగూడ పంచుకొన వలయు నేమో. అవును ధనముగదా యంతపని చేయించునది.

మ॥ చెడుత్రోవన్ నడపించు సాధుజనులన్ శిక్షింపఁగాఁ జేయుఁగా.
రడవిన్ వాసముగూర్చు నిర్మలకులోద్య ద్వైభవంబెల్లఁ బో

కడ బెట్టున్ ధనప్రాణమేని విషవంగా బుద్ధి గల్గించునె
ప్పుడు గూడన్ దగదెట్టి వారికి ధనంబున్ గోరఁగానిమ్మహిన్॥

ఇట్లు చాలమార్లు నాకు నేను బుద్ధి చెప్పుకొనుచు మరల దీనిఁ గాంక్షించుచుంటిని. నా ప్రాణము ధనము ధనమనియె యెగిరి పోవు నేమో.

(నిష్క్రమించును.)

తరువాత వీరసేనమహారాజు-ధీమంతుఁడు ప్రతాపుఁడు ప్రవేశింతురు

వీర—అమాత్యా! నాయీవిచారసాగర మపారముగదా దీని నెట్లు
దరింపఁగలను.

మ. అరిగాపుల్ వినతాంగులై రథగజాశ్వానీకమున్గాన్కఁగాఁ
బరగింపన్ జతురబ్ధివేష్టిత మహాభాగంబు భోగంబుగా
ధరియింపన్గలవాఁడనై యకట నింద్యంబైన కార్యంబు సో
దరుఁడేసల్పఁగ మాన్పలేకిటుల వంతన్ జెందుచుంటిన్గదా.

ధీమ:—దేవా! నన్నుఁగూడఁ దమసోదరుని విషయమైన విచారవ
గ్నిలేకయే దహింపుచున్నది. వీరసేనమహారాజుగారి తమ్ము
డిట్టి యకార్యములనల్పుచున్నాఁడనిన దిగంతవిశ్రాంతయశో
విశాలురగుఁ దమకీర్తి కెట్టికళంకము గలుగునోయని యనే
విధంబుల మంచిమార్గమునకుఁ గొనిరాఁ బ్రయత్నించితిని కా
నాప్రయాసమెల్లఁ బాముకుఁ బాలుఁ వోసినట్లుల విపరీతము
నయ్యెను.

వీర:—అవును దుర్జనస్వభావమట్టిదే.

చ. అరయఁ బరోపకారియగు నాతఁడు దుష్టుని జేరఁదీసి తా
స్థిరమతిమంచిమార్గ ముపదేశము జేసినసాధువౌనొకో

ధరణినివేపచెట్టునకుఁ దద్దయుఁజక్కరనీరు వోసినన్
జెఱకగునే స్వభావమును జేదునువీడి యొకప్పుడేనియున్.

కావున నీ నీతియంతయు నామదుశ్చారిత్రునియం దూసరక్షేత్రమందుజల్లిన విత్తులవలె వ్యర్థమగుటయుగాక మిఁనుమిక్కిలియు నాతని యపకృత్యములకు వృద్ధినిచ్చుచున్నది.

తే. సన్నిపాతోపహతుఁడై యున్నవాని
కలిమిమృష్టాన్నమిడఁ దలకెక్కుఁగాక
యంకురమునకు నీరోసినటులు వాని
వృద్ధికిం గారణంబగునే తలంప.

నే ననేకవిధంబులుగ సామదానములచే బోధించితిని వినఁ డయ్యె. నాయుపదేశమంతయు వానియెడ నరణ్యరోదనమట్లు లాభము గాదయ్యె. ఆదుర్మార్గుని కృత్యంబులఁ దలఁచిన నాహృదయము వేయి వ్రక్కలగుచున్నది.

సీ. లాతినాతులఁగన్న నీతి యించుకలేక
బలిమిమైబడి చెఱఁబట్టుచుండు
నన్మార్గగాముల ఛాయమైసోకిన
దయమాలి దండింపఁదలఁచుచుండు
నెదురయ్యెనేని యాకచుపులనైనను
దృటికాలమును సహింపించుచుండు
బసిఁడిఁదాల్చిరయేని పసిబాలురనుగాని
విడక ప్రాణంబులఁ గొడవుచుండు

తే. సములమగు రాజవంశంబునందుఁ బుట్టి
సద్గుణమొకించుకలేక నీచతముఁడగుచుఁ

కుష్టచిత్తుండు చెనటులతోడఁ గూడి
కులమునకుఁ గళంకంబును కూర్చెడుగద.

మఱియు.....

తే. కన్నవారలకన్న నిక్కముగ బేర్మిఁ
బ్రోవఁగాదగుఁ బౌరుల సేవగించి
యేచుచున్నాఁడు పాపియై యితఁడు నేను
సోదరుండనుచు నుపేక్షఁ జూచుచుండ.

అయ్యో! పూజ్యమగు నారాజ్యమునకు దుష్టబుద్ధివలనఁ గలిగిన విపత్తునకుఁ బ్రతీకారమేమి చేయుదును.

ధీమం: —

ఉ. చేయునదేమి యూచెనఁటి సేతలు రోఁతలు గాఁ జెలంగి చీ
చీ యనిపింపకుండునె యిసీ మనపల్కిన పల్కులన్ని యున్
హేయములయ్యె వానియెడ నేగతిఁ జూచినమంచి త్రోవకై
పోయెడివాఁడు గాఁడతఁడు భూవర యేటికిఁ జింతసేయుటల్.

తే. దండ్యులను గౌరవించి యదండ్యులైన
వారలను బాధలొనరించు ధారుణీశుఁ
డపయశము నొందు నరకంబునధివసించు
నాతని నుపేక్షఁ జూడ న్యాయంబె జగతి.

కావున నాతనివిషయమై రిత్తమాటవలనఁ బ్రయోజనము లేదు.

సేవకుఁడు: — (ప్రవేశించి) మహారాజా! జయము జయము. ధనగుప్తుఁడను వైశ్యశిఖామణియు మఱికొందఱు పౌరులును దీనవదనులై ద్వారమునఁ దమ దర్శనము గోరుచున్నవారు.

వీరసే:—(ఆదరముతో) సత్వరము ప్రవేశింపఁజేయుము.)

(పౌరులు ధనగుప్తుఁడును దుఃఖముతో ప్రవేశింతురు.)

వీరసే:—ధనగుప్తా! ప్రాతఃకాల చంద్రబింబమువలె నీముఖము వెల వెలఁబోవుచున్న దేల. కారణమేమి? (పౌరులఁ గాంచి) మీ కీ తీరనిదుఃఖమేలకలిగెను?

ధన—మహారాజా! మాకష్టము లేమని చెప్పఁగలము:

సీ. బలగర్వమున సురపక్షిఁ జెండాడిన
శూరుఁడౌ తారకాసురునికన్న
వేదముల్ దొంగిలి వెసనబ్ధిడాఁగిన
యనదయౌ సోమకాహ్వయునికన్న
ఇంద్రాణికై నం యమీంద్రులపై నెక్కి
యూరేగినట్టి నహుషునికన్న
జ్యేష్ఠుని వంచించి క్షితినాక్రమించిన
కఠినాత్ముఁడైన పుష్కరునికన్న
తే. క్రుద్ధుఁడై పాపనిరతుఁడై క్రూరుఁడగుచు
సిరుల కాశ్రయమైన యీ పురమునందు
దుష్టచిత్తుండొనర్చెడి దుండగముల
నకట వచియింప నెవ్వారికైన వశమె.

పౌరులు:—మాందొరో నీకు దండాలు సేసేమ్. మమ్ము రచ్చించాలి సామా.

మంత్రి:—శాంతింపుఁడు శాంతింపుఁడు భయపడఁకుఁడు.

ధన:—(దైన్యముతో) మహారాజా! సహస్రభానుని కరంబులలోఁ బద్మవనమట్లు దేవర పరిపాలనంబున నేకొంతయు నిలుఁగక

సుఖంబుండు మా కెల్లులకు నేటికి మీ సోదరునివలనఁ గలుగు బాధలు చెప్పుటకు వలనుగాకున్నవి. తానును తన మిత్రములును మా వాణిజ్యముల సాగనీయరు. మమ్ముఁ గాంచిన నాకొన్న శార్దూలము లట్లు పైఁబడి చావమోదుచుందురు మేమేదియేని మా రాడిన మా కొంపలఁ గాల్చుచుందురు అయ్యో రాజా ! ఇఁకనైన మా కష్టంబు దీర్పుఁడు. తన భటులడిగినంత రొక్కమీయలేదను రోషంబున నిద్రించు మా పద్మసేన నెత్తుకొని పోవుటయగాక మా మేనల్లుని నిల్లు నిప్పంటించిరి.

వీర:—అకటా పౌరుల కెట్టి యిక్కట్లు వాటిల్లెను!

పౌరులు:— సామో యింక మేమీ వూళ్ళో కాపురాలుండి బతుక లేము. మా గొడ్లన్నీ దుష్టబుద్ధి బంటులకు బలై పోతున్నవి. మాతోటలన్నీ పాడే మా గింజలన్నీ దొంగలపాలే అయ్యో మమ్ము రక్షించండి. ఆడుసేసే పనులన్నీ పాడుపనులే. ఒక నాడా ఒకపూటా ఎంతకాలమని ఓర్చుకుంటాము.

ధన:— దేవ ! మతియొక విన్నప మాలింపుఁడు.

ఆ. కూడు నిద్దురయును గొఱయయ్యె ప్రజలకుఁ
గొల్లు గట్టివేసి కొనఁగవలసె
నహహా యెటులఁజెప్ప దాతని కృత్యముల్
గాంచితీరవలయుఁ గానితండ్రి.

వీర:—ధనగుప్తా ! ఇఁకమీఁద నసుజుఁడని యైనఁ దలంపక లోక కంటకుఁడగు దుష్టబుద్ధిని శాసించి మీవెతలఁ బాపెదను దుఃఖంపకుఁడు.

ధన:— తండ్రీ! మాకష్టములఁ బాపి రక్షింపుఁడు.

పౌరులు:— దొరా మమ్ము రక్షించండి (అని ధనగుప్తునితో విన్నవింతురు.)

పరసేన:— అమాత్యా వింటివిగదా దుష్టుని కృత్యములు. మనము ఉపేక్షించిన కొలఁదియు వాఁడు మితిమీరు చున్నవాఁడు.

తే. తనబలిమికాండ్రకు న్గానితనకుఁగాని
యెటులు దోఁచెడు నయ్యది హీనమైన
మంచి చెడుఁగుల గణియింప కించుకేని
యుచిత కార్యంబు గతినల్పుచుండు నహహా!

తే. పేరునకుఁ దగినట్టులు క్రూరుఁడగుచుఁ
బిన్న పెద్దల నరయక పిదపవోలెఁ
గనుఁబడినవారి నెల్ల నొక్కరినిగూడ
విడక బాధించుచుండు నెప్పుడు నతండు

కావున నాతని విషయమేమందువు.

సుమం:— దేవ! అనుటకేమున్నది.

ఉ. పౌరుల పాలిమృత్యువలెఁ బాపమునే నతతంబుఁగోయు నా
క్రూరు నుపేక్షసేయ కిభకోటి పదాహతి మగ్గఁ జేయుటో
వారక యుష్మదీయ కరవాలమునన్ దెగవ్రేయుటో తగుఁ
మీఱిన కూర్మిచే విడుతుమేని మఱింత దురంతమయ్యెడిన్.

అని నేను తమతో నిన్నటి దినమున విన్నవింప వల్లెయని తమరు ప్రతాపునకాజ్ఞ యిచ్చితిరిగదా.

పరసేను:— అవును నిజమే రాజ్యంబునకుఁ గలిగిన విపత్తునుగూర్చి వ్యగ్రమనస్కుఁడనగు నాకు జ్ఞాపకము లేదు. (ప్రతాపునిజూచి)

ఓయీ నేఁడే దురాత్ముఁడగు నాతని బంధింపుము. తరువాత యాలోచింతము.

ప్రతాపు:— చిత్తము. ఏలినవారి యాజ్ఞ.

ధీమం:— దేవ ! ఇప్పటికిఁ జాలప్రొద్దయినది. నేటితో నీసభ చాలించుట కానతీయుఁడు.

వీరసేన:— అట్లే కానిమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

మీనాక్ష్యైనమః

# విషాద కనకతారీయము.

## ద్వితీయాంకము.

చారుమతి ప్రవేశించి

చారుమతి:—(అంజలిబట్టి)

ఉ. నీవకదా సమస్తధరణీతలమున్ సృజియించి పిమ్మటన్
బ్రోవఁగనేర్చి యంతమును బొందఁగఁజేసి వెలుంగు దేజమా
జీవనకారణీ సకల శిష్టజనావని పావనీ యిఁకన్
దావకపాదపద్మములెదన్ భజియించెదఁ గాళికేశ్వరీ.

తల్లీ జగదీశ్వరీ ! సకలచరాచర లోకంబుల కాధార భూతవు వై చంద్రశేఖరు నర్ధాంగము నలంకరించిన నీసేవావకాశము గలిగినందుకు నేనెంతయు ధన్యురాలను. అనయంబును త్వదీయ పాదకమల ధ్యానచిత్తనగు నాకుఁగలనేని నీపవిత్రనామంబు విస్మృతి గలుగున

ట్లు చేయక జగన్మాతవగు నీదాసురాలిని రక్షింపుము. నిఖిల రాజశేఖర సమర్పిత దివ్యమణిభూషణానన్యసామాన సహస్రసంతోషిత స్వాంతుఁడగు వీరసేనమహీపతి కర్ధాంగినగుట నీకృపావిశేషంబుననేకదా! తడవుకాలము పుత్రసుఖ సందర్శనాభిరతిచేఁ జింతింపుచు సాటివారలలో దీనులమై చరింప మాకు బిడ్డలుదయించి సంతసముఁగూర్చుట నీ నామస్మరణము కతనఁగదా ఈనాటివఱకెట్టులు మమ్ముఁగంటిఱెప్పవలె గాపాడుచుంటివో యటులే యికమీఁదఁగూడ రక్షింతువని నమ్మియున్నదాన. (వెనుకకుఁజూచి) ఈనాఁడేలొకో నామనోవాంఛ చింతదనుక వచ్చినట్లుగానరాదే. కారణమేమైయుండును. (ఆలోచించి) అవును మరచితి. కడచినరాత్రి దుష్టబుద్ధి పద్మసేనయను కన్నియ నెత్తుకొనిపోయెనని ధనగుప్తుఁడా ఘోరకృత్యము మహారాజుగారితో విన్నవించుటకై చనుచుండునప్పుడు గాంచిన నాచెలి యిప్పుడేకదా చెప్పినది. పాపము పద్మసేన కెట్టియిక్కట్టువచ్చెను.

మ. నిరతంబున్ ఖలమైత్రిచేత మదినింతే నిన్ విచారింపకన్
దురితంబుల్ బొసఁగించుచుండు ననుజన్మన్ మంచిమార్గంబునన్
నరిజేయన్ గృషి చేసిచేసి విఫలస్వాంతంబునన్ రాజశే
ఖరుఁ డున్నాఁడు కృశించుచున్ గటకటా కర్తవ్యమింకెద్దియో!

యాదవకులంబున ముసలంబువలె దుష్టబుద్ధి మాకులంబునఁ బుట్టి పూర్వులకీర్తిని జెఱచుచున్నాఁడు. హావిధీ! ఎట్టి పవిత్రమగు కులంబున నెట్టివానిని బుట్టించితివి!

చ. జలనిధిఁ బాడబంబటులు చంద్రుకరంబులలోఁ గళంకముల్
బలె నగరాజుపై తుహినబంధము రీతిఁ బవిత్రమైన మా
కులమునకిట్టి దుర్మతినిఁగూర్చి కళంకము దెచ్చిపెట్టితే
జలరుహనాభ పూర్వభవసంచిత మెవ్వరికైనఁ దప్పునే.

(ముందునకుఁజూచి) అదె నాజీవితేశ్వరుఁడు వచ్చుచున్నవాఁడు.

తే. చలదుడుపరీతమగు శరచ్చంద్రబింబ
మటులనలరారు విభుని యాస్యంబదేమొ
అకటనీహారకణ పరివ్యాప్తమైన
పద్మముంబలె స్విన్నమై ప్రభనుదక్కె.

ఎర:—(విచారముతోఁ బ్రవేశించును)

చారుమతి:—ప్రాణేశ్వరా! నానమస్కారముగొనుఁడు,

ఎర:—మనోహారీ! నీకుశుభమగుఁగాక.

చారు:—నాధా! కృష్ణపక్షపుఁ జంద్రబింబమట్లు మీ వదనంబు తేజో విహీనమైయున్న దేల ?

ఎర:—(పలుకకుండును)

చారు:—(స్వగతం) కట్టా! ఎట్టియిక్కట్టులు గల్గినను ధైర్యంబుజెడక నన్నుగాంచినంత నెంతో సంతోషంబున దరహాసముగావించు నామనోహరుఁడేలొకో పిలచినను బలుకకవదనంబున తనవిచారంబును సూచించుచున్నాఁడు. కారణమెద్దియోకదా. (ప్రకాశముగా) నాధా పలుకరేల (అని కౌగిలించుకొని)

తే. సాధుజనులనుగాంచిన శాంతరసము
వైరిసంతతిగనుగొన్న వీరరసము
కరుణననుగన్న వేళ శృంగారరసము
గురియుముఖమేలవహించుఁ గరుణరసము.

ఎర:— దేవీ! ఏమని చెప్పఁగలను.

క. అనుచరుఁడై యొవుడేపని
నొనరింప ననుజ్ఞ జేతు నుచితమనుచునా

(ముందునకుఁజూచి) అదె నాజీవితేశ్వరుఁడు వచ్చుచున్నవాఁడు.

తే. చలదుడుపరీతమగు శరచ్చంద్రబింబ
మటులనలరారు విభుని యాస్యంబదేమొ
అకటనీహారకణ పరివ్యాప్తమైన
పద్మముంబలె స్విన్నమై ప్రభనుడక్కె.

ఎర:—(విచారముతోఁ బ్రవేశించును)

చారుమతి:—ప్రాణేశ్వరా! నానమస్కారముగొనుఁడు,

ఎర:—మనోహారీ! నీకుశుభమగుఁగాక.

చారు:—నాధా! కృష్ణపక్షపుఁ జంద్రబింబమట్లు మీ వదనంబు తేజో విహీనమైయున్న దేల?

ఎర:—(పలుకకుండును)

చారు:—(స్వగతం) కట్టా! ఎట్టియికట్టులు గల్గినను ధైర్యంబుజెడక నన్నుగాంచినంత నెంతోసంతోషంబున దరహాసముగావించు నామనోహరుఁడేలొకో పిలచినను బలుకకవదనంబున తనవిచారంబును సూచించుచున్నాఁడు. కారణమెద్దియోకదా. (ప్రకాశముగా) నాధా పలుకరేల (అని కౌగిలించుకొని)

తే. సాధుజనులనుగాంచిన శాంతరసము
వైరిసంతతిగనుగొన్న వీరరసము
కరుణననుగన్న వేళ శృంగారరసము
గురియుముఖమేలవహించుఁ గరుణరసము.

ఎర:— దేవీ! ఏమని చెప్పఁగలను.

క. అనుచరుఁడై యొవుడేపని
నొనరింప ననుజ్ఞ జేతు నుచితమనుచునా

సితవాలంబున దుష్టచిత్తుఁడు వధించెన్ మచ్చుహ్యాపత్రిత్న మీ
గతిఁజూనంచు నెఱుంగనైతి నకటా కళ్యాణి యెట్లోర్చెదన్.

చారు:—(స్వగతము) ఔరా దురాత్మా! ఎట్టి ఘోరకార్యంబులాచరించుచుంటివిరా. ఇట్టిఘాతహింస నిన్ను వెన్నంటి సంహరింపక విడచునా. (ప్రకాశముగా) నాథా! "విపది ధైర్యమథాభ్యుదయే క్షమా" అనుమాట మీరెఱుఁగనిదికాదు. ధైర్యము బూనుఁడు. మనయదృష్ట మీనాటికిట్లైనది. దైవయోగంబున కెవరేమి చేయఁగలరు.

వీరసే:—అవును నీవన్నది నిక్కువమే. అయినను నిష్కారణంబుగ నిట్టి యకృత్యంబులు జరుగుచుండఁ జూచి సహించుట కష్టము గాదా. ఇప్పుడు వారలఁజంపిన వాఁడు రేపట నన్ను మాత్రము విడచునా?

చారు:—నాథా! అటులెన్నటికిని జరుగదు. మీనోటవచ్చు నమంగళ వాక్యములు నాకుఁ గర్ణకఠోరములుగ నున్నవి.

వీరసే:—దుర్మార్గుఁడగు నాసోదరుని కృత్యంబులఁగాంచిన నాకీప్రాణంబులపై యసహ్యముగలుగుచున్నది. నామిత్రులనెడఁబాసి యాతనితోనుండ నేమిఫలము.

చారు:—మనోహరా! లోకంబున నెవ్వరయిన విధివశంబునఁ జచ్చినవారలకై బలవంతముగఁ జత్తుమను వారుందురా? జీవహింస యకార్యమని మీరెఱుఁగరే.

ఆ. బ్రహ్మహత్యయును గోమాంసభక్షణంబు
ప్రాణహింసయును స్వర్ణచౌర్యంబు మొదలు
గాఁగల యకృత్యములు నరకమునఁద్రోయు
ననుచు పెద్దలువచియింప వినఁగలేదె.

(తరువాత కనకశేఖరుఁడు ప్రవేశించును.)

కనక:-ఆహా అదిగో నాయనగారివదన మెంతవిచారగ్రస్తమైయున్నది.

మ. రణ రంగంబునఁ జుట్టుముట్టియు రిపువ్రాతంబు పెల్లార్చి బా
ణగణముల్ పైఁబఱగించుచో నయిన ధైర్యంబూని వర్తించుఁడా
నణుమాత్రంబును జెన్నుఁ లేక తుహినవ్యాప్తేందు బింబంబటుల్
గణియింపన్ బడుచున్నదేలొకో జగత్కల్యాణు మోమియ్యెడన్.

(ఆలోచించి) అవును కులనాశకుండగు దుష్టబుద్ధిచేయు దుండగములఁ దలంచి నాయనగారు చింతానిమగ్నులై యున్నారని యిప్పు డేగదా మాభగిని తారావతి చెప్పిపోయినది. దుష్టబుద్ధి యకృత్యములకు సహింపలేక పౌరులు నాయనగారితో విన్నవించుకొన దుష్టశిక్షా దక్షుఁడగు మామకపిత తమ్ముఁడనియైనఁ గనికర ముంచక యాదురాత్ముని బంధింపుఁడని మంత్రి సేనాపతుల కాజ్ఞ యిడినంత యెట్టులో దాని నెఱింగియా క్రూరుఁడు నిద్రించు మంత్రిచమూపతుల జంపెనట. కట్టా యెంత మోసము సంభవించెను. ఇంకనైన నాకుటిల స్వభావుని దండింపవలయును. లేకున్న మితిమీఱి సాధ్యుఁడుగాఁడు—
అదే నాయనగారమ్మగారితో నేదియో ముచ్చటించుచున్నారు.
(సమీపించి) తలిదండ్రులారా! నమస్కరించెదను.

చారు:—నాయనా! ఇటురమ్ము (అని కౌఁగిలించుకొనును.)

కన:—(తండ్రినిఁజూచి)

తే. అనుజునెడఁ గూర్మిచేత రాజ్యమునకెల్లఁ
గీడొనర్చుచు నుండినఁ గూడ నిటులఁ
దమకుపేక్షించి యుండఁగఁ దగునె ప్రజల
కష్టసుఖములు మనయవిగావె తండ్రి.

వీర:—(ఆశ్చర్య దైన్యములు ముఖమున నటింప) నాయనా నేనేమి చేయఁగలను. ఆతఁడు దుర్మార్గుఁడుగదా.

కనక:— చేయుట కేమున్నది.

మ. తన యిల్లాలయినన్ సుతుండయిన మిత్రంబైన నాచార్యుఁడై
ననుదమ్ముండయి యుండినన్ దుదకుఁ బ్రాణంబైనఁ బోనాడిలో
కనికాయంబులకున్ సుఖంబు నలుపంగా యోగ్యమౌఁగాక నెం
దునకున్ జాలని బీకవోలె మదినెంతో చింతిలన్ గార్యమే.

చారు:— ఏమీ నాబిడ్డని పౌరుషము యోధాగ్రేసరులవోలె ధైర్యమునఁబల్కుచున్నాఁడు రత్నాకరుని గర్భసీమ నుదయించిన చంద్రుఁడులోలె నాహ్లాదకరుఁడగు వీనిపల్కులకు నాకెంతయో సంతసము గల్గుచున్నది.

వీర:—(చారుమతినిగాంచి) దేవీ! చూచితివా యీకుఱ్ఱవాని సాహసంబు పదియేండ్లయిన సంపూర్ణములుగ లేని నాముద్దులపట్టి మాటలకును దుష్టబుద్ధి యొనర్చు ఘోరకృత్యములకును

తే. అర్కుఁడుదయింప నస్తమయంబుఁ జెంద
జలజమునకే యవస్థలు సంభవించు
నాయవస్థలు రెండొక్క యెదను నందె
కాంత నావదనంబునఁగానఁ బడెడు

(కనకశేఖరునిజూచి) నీ ధైర్యమునకుసంతసించితిని. అయినను నా యిప్పటి యవస్థఁగన్న వెనుకనుయ్యియు ముందు జెఱువునన్నట్లున్నది.

కనక:—తండ్రీ! కులనాశకుఁడగు వాఁడెవఁడైన నేమి యవస్యంబు వధ్యుఁడేయగు మీకాదుర్మార్గునందు మోమోటముండెనేని నా కానతిండు.

వీర:—కుమారా ! నీవు పసివాఁడవు. విశేషించి లోకజ్ఞానము లేని వాఁడవు. అందువలనఁ దోఁచినట్లులఁ బల్కుచుందువు. ఇప్పు డాదుష్టుఁడు వధింపఁ దగఁడు.

కనక:—ఎందువలన.

వీర:—తాఁ జేసిన కార్యము నింద్యమైనదిగాన దానివిషయమై నేనే మైనఁ దన్ను దండింపఁ దలఁచుకొందునేమో యని యతఁడు జాగ్రతగ నుండును.

కనక:—అయిన నాతని విషయమై యుపేక్షాభావమేనా!

వీర:—కాదు సమయ మపేక్షించెద.

కనక:—తమచిత్తమట్లు గానిండు నేనికఁ బోవలసి యుంటిగాక.

(అని నిష్క్రమించును.)

వీర:—జీవితేశ్వరీ ! నేఁడా దురాత్ముని గూర్చి విచారించుటవలన నాకుఁ దీరని శిరోవేదన గలుగుచున్నది కావున శయనించెద. ఇప్పటికే చాల రాత్రి యయినది. నీవును నీ శయ్యాగృహమున కరుగుము.

(అని శయనించును జారుమతి నిష్క్రమించును.)

దుష్టమతి:—(ప్రవేశించి) నా కాజన్మ శత్రువులై యహరహంబు నాయన్నతో నా నేరములఁ జెప్పుచుండువా రిరువుర వీరకే తువు సామర్థ్యమున యమలోకమున కనిపితిని. ఇఁక మీఁద వీరసేనుని కారాగృహమున బంధించవలయుఁగది. (నలు వంకలఁ జూచి) ఆభీతుఁ డిందెచ్చటను గానవచ్చుటలేదు. ఒక వేళ నాయత్న మెఱిఁగి పారిపోయి యుండఁడుగదా. (దల కంపించుచు) ఏమీ నాకుఁ జిక్కక పోనేర్చుఁగా నామనస్సు

నకు గుణియగు వాఁడీ నకుఁ రాల్గులోకములలో నెందుఁ డాఁగినను బ్రతుకనేర్చునే—(వెతకి వీరసేనుని గాంచి) ఓహో యిక్కడ నేపడి నిద్రించుచున్నవాఁడు నా పరిశ్రమమూరక పోవునా? (దగ్గఱకుఁ బోయి కత్తి నెత్తి) వీని నీ తీవ్రాసి చేతఁ బెద్ద నిద్దుర నొందింతునా! (వెనుకకుఁ బోయి) కాదు కాదు. కాలచక్రి మెప్పటి కెట్లు దిరుగఁగలదో. పోనీ పాపము. అగ్రజుఁడు కదా. విడచిపోయెదను. నాపై కొండెములఁ జెప్పుచుండకొండుకులఁ జెండితినికదా? ఇఁక నా నేరము లితని కెవరు చెప్పఁ గలరు. (ఆలోచించి) బాగు బాగు. మంచి పనియే. వీని విడచితినా నాకష్టమంతయు వ్యర్థమే. ఈనఁగాఁచి నక్కలపాలు జేసినట్లగును. నా మొదటి యుద్దేశ్యము చారుమతిని గూడుటకదా. అది యెట్లు సంభవింపఁగలదు. కావున వీర కేతువు నుడివి నట్టులఁ జేయుటయే మంచిది.

(అని వీరసేనుని బంధించును.)

(పిమ్మట దెలుపడును.)

(తెలో) తే. నిలు నిలుము పోకుపోకుమో నిలఁతనీవు
నీకు రక్షకుఁ డెవ్వఁడీలోకమందు
నా పరిశ్రమమది చెడునా తలంప
వంట యింటి కుందేలెట్లు బారఁగలదు.

చారు:—(దుఃఖముతో ప్రవేశించి) ఓ దీనరక్షకులారా! ఆర్త పోషకులారా! భూతదయాపరులారా! రక్షింపుఁడు రక్షింపుఁడు.

ఉ. ఏనొక దీనురాల దురదృష్టవశంబున దుష్టబుద్ధికిన్
లోనయితిన్ కృపారసవిలోకనముల్ జెలువారనిప్పుడో

హానృపచంద్రులార సుగుణోదధులార మునీంద్రులార న
న్యాయముతోడ మీరలయినన్ నను దగ్గఱఁదీసి బ్రోవరే.

తే. నగములార మహాజపన్నగములార
యక్షులార శ్రితావనదక్షులార
క్రూరుఁడగు దుష్టచిత్తుని బారినుండి
కావరే మీరలైన నన్గరుణతోడ.

అక్కటా యీ మహారణ్య మధ్యంబున నాకు దిక్కెవ్వరు. ఎంత విలపించినను నన్ను రక్షించు పుణ్యాత్ముఁ డొక్కఁడును గానరాఁడు గదా. అయ్యో యిట్టి విపత్తు గలుగునని యెన్నఁడైన నను దలంచితినే. దైవమా! యెంతలో నెంతఁ జేసితివి. బాలచాపల్యముననైనఁ బరుల దుఃఖపెట్టి యెఱుఁగనే అట్టి నాకీభరింపరాని వెత గల్గింపఁ బాడియే. హా దుస్స్వప్నమా! ఎంత పనిఁ జేసితివే. క్షణమాగిన నీకు శాంతిఁ జేయించుదునుగదా. ఇంతలోనే త్వరపడవలయునా ఎన్నఁడును నీ సామర్థ్యము నాకెఱింగింప నదను దొరకనందులకా, తఱిజూచి యీ పనిగావించితివి. హా మృత్యువా! నీవైన దయఁదలఁచి యీ దరిద్రదేవతను మ్రింగివేయరాదో నాకీతిరని యిడుములఁ గల్గించిన నేమిలాభము. జగదీశ్వరీ కాళికా! నిన్ననేగదా నీసేవఁ జేసి వేఁడుకొనినది. అప్పుడే నాపైనేల రోషము గలిగెను.

[అని మూర్ఛపడి కొంతవడికిఁ దెలిసి

తే. నిస్సపత్నుండగుచు ధరణీతలంబు
సౌఖ్యముగనేలు నారాజచంద్రునకిలఁ
బత్నినై పుట్టి యొక్కని భాగ్యకతనఁ
బడఁగరానట్టి కష్టముల్ బడఁగవలసె.

అహా! యీ మహాటవి సంచరించు క్రూరమృగ మేదియైనను నన్ను మ్రింగిన బాగుండునుగదా. (సముద్రమునుగాంచి) ఓరత్నాకరా సకలలోకాధార! నీవు దక్క నాయాపద దప్పింప నెవరుఁ గలరు. నీదరిఁ జేరితి రక్షింపుము.

చ. మనుజనకాత్మజా విరహమూర్ఛితుఁడై యెదఁగుందుచుండురా
మునకుఁ బధంబుఁ జూపి యశమున్ గొనినట్టి జగన్నుతుండవో
యనఘ యనాథనై యిటుల నన్యుని బారికిఁ జిక్కి చింతలన్
మునిఁగిన దీనురాలనను బ్రోవఁగ రావదియేల నక్కటా.

రమాజనకుండవగునో మహానుభావా! నామొరాలకించి నన్ను రక్షింపుము (కొంచెమూరకుండి) జగదాధారుఁడగు నాదినారాయణు నకుఁ గన్యాదానము గావించిన పవిత్రమూర్తివే మహేంద్రుని బారికి జిక్కి వెతగుందుమై నాతనిగాపాడిన యుక్రోధనుండవే అట్టినీవీ దురదృష్ట వంతురాలిని రక్షింపభారమా తండ్రీ!

(నిలునిలు పోకుపోకు అను నొకటి పద్యమును జదువుచు దుష్టబుద్ధి ప్రవేశించును.)

చారుమతి:—అక్కటా దైవమా! ఇంతటనైన నన్నీ కష్టముఁడు విడచునట్లులేదే.

చ. నిరతజితారివర్గధరణీ నేతకుముద్దులకూన్పుగా శుభా
భరణకు భూమిదేవికి సపత్నిగఁ బుట్టి సభక్తి నామహే
శ్వరు చరణారవిందముల సంతతముఁ భజియించునాకు దు
ర్మరణముగల్గునట్టులుగ వ్రాసితె హావిధి ఫాలమందునన్.

(అని సముద్రమునఁ బడఁబోవును.)

దుష్టబుద్ధి:—(అడ్డమువచ్చి) ఏమె నీ గయ్యాళితనము నీ బెదరింపులకు

నీతినొందుమనుచనుకొంటివా అట్టినన్నటికినిదలంపకుము. నామాట వినుము. (అని లేవఁదీయును.)

చారు:—(లేచుచు) హా జగదీశ్వరీ! రక్షింపుము. రక్షింపుము.

దుష్టబుద్ధి:—తరుణీ! ఈవృథా కాలక్షేపముచేత నన్నాయాసము బెట్టనేల (అని పట్టుకొనఁబోవును)

చారు:—(తప్పించుకొని స్వగతము) అయ్యో దైవమా! ఇంతట నైన నన్ను విడువక మఱియు నేమి జేయఁ దలఁచితివి. కలనైన బరపురుషుని మోముఁ జూడనొల్లని నాకీ భుజంగుచే బాధగలు గునట్లు జేయ నేమిటికి (ప్రకాశము గా దుష్టబుద్ధిఁ జూచి) అయ్యా పరకాంతలను బలిమిని జెఱబట్ట మీవంటి యుత్తమాన్వవా యులకుఁ జెల్లునా

దుష్ట:—ఓసీ! ఎంత గయ్యాళివే పరకాంతనని పల్కినంత విడుతునా నీవెవతవైననేమి.

చారు:—అయ్యో పరకాంతాభిరతి దోషావహము పెద్దలు నుడువ వినవా!

సీ. గురుపత్నితో రతి గూడ నబ్జారికి
ఘనతరంబగు గళంకంబుగల్గె
సీతామహాదేవి జెఱగొన్న రావణు
కులమునిశ్శేషమై కూలిపోయె
గౌతముపత్నిపైఁ బ్రీతిఁ జెందిన శచీ
కాంతుని మేనసహస్రముగు బొడమె
ద్రౌపదిగూడ యత్నంబొనరించిన
సింహబలుని పేరు శేషమయ్యె

గీ. బృందయో మైత్రిగాంచి గోవిందుఁడహహ
యెన్నియో జన్మములు ధాత్రి నెత్తినాఁడు
కానిశివ్వరికిని బరకాంత యెపుడు
కోరఁగా రాదు కలనైని క్రూరచిత్త.

దుష్టబుద్ధి:—(తనలో) ఏమీ నీవు పరకాంతవా? నీతోఁగలసిన నాకు దోషమా పాపము నానేమమునకే చెప్పుచుంటివిగాఁ బోలు కనుకనే యిట్లు గావించితిని. (ప్రకాశముగా) తరుణీ నీకుఁ దోఁచినట్టులుగాఁ బల్కి నన్ను నమ్మించి పారిపోఁజూచితివి. నీవెన్ని భంగులఁ దప్పించుకొన యత్నించినను సాగదు. వారివారి ప్రారబ్ధమునఁ జెందుదురుగాని యన్యకాంతలగలసినంతఁజెడిపోరు. ఇటువినుము.

సీ. మేనకా నమరతిఁ బూనికగాఁజేసి
ఘనతఁ గోల్పోయెనే గాధిపట్టి
దాశకన్యాకేళిఁ దమిఁదీర నొనరించి
రహిఁజెడినాఁడె పారాశరుండు
పరమపావనియైనఁ భాగీరథినిగూడి
చింతల నొందెనే శంతనుండు
అంబాలికా సంగమంబును గావించి
వంశంబునిల్పఁడే వ్యాసమౌని

మఱియు.

తే. మును మెండ తెందఱో మూందకాఁడ
మొదలుగా గలవారలే ముఖ్యమనుచు
నన్యకాంతలఁగూడి రసంగలాతి
వారిగణియింపఁగాఁ నేల వనిత యిపుడు

—వున నీ యుపన్యాసముల విడచి నాదయకుఁ బాత్రమవు
గమ్ము (అని దగ్గఱకు బోవును)

చారు:—తండ్రీ! నన్ను ముట్టరాకుము. నిగ్రహానుగ్రహసమర్థు లగు నీవుచెప్పినవార లెంతకైనఁ గలుదురు. వారెల్లరో లోకైక మహాకార్యోద్ధరణమునకు సంచరించిరిగాని కామోద్రేకంబున గాదు. పులిఁజూచి నక్క వాతవేసికొనినట్లు వారినిజూచి మన మాచరింపఁదగునా. సీతాకాంత వానికిఁ గావలయునన్న దివ్య కాంతలనైన నిందించెడు బోటులు దొరకరా! అనాథనై దిక్కు లేక పిక్కటిల్లు నీశోక సాగరంబున మునింగిన నన్నేలగోరెదవు.

నష్టు:—కాంతా! ఎందులకీ యసత్యములగు ధర్మశాస్త్రముల నా మోల్కి విప్పెదవు ఇవియన్నియు ముదిమిచే మతిచెదరిన ఛాందసులచేఁ గల్పింపఁబడినవి. కాని వేఱుగాదు. అట్లుగాక నిక్కువములని తలంతువా ఆధర్మశాస్త్ర రచయితలేవన పర్ణాంబు భక్షులై యరణ్యములందు ముక్కు మూసికొని యనేక విధంబులగుఁ దపంబులు సల్పునా మునుసలి తపసులె య్యెంకఱనో సుందరాంగులఁగూడి సురత కేళికల నోలలాడిరి గదా. అదేమనినచో వారు సమర్థులు మన మసమర్థుల మనియు శ్రీరంగనీతుల దిద్దెదవు. నిన్నే మన వలచును.

చారు:—(తనలో) అకటా యీ దుర్మార్గున కెన్ని హితోపదేశ వాక్యములు చెప్పినను బూడిఁబోసిన నేయివలె వ్యర్థ మగుచున్నవే. ఇఁకేమి సేయఁగలను. (ప్రకాశముగా) అయ్యా నావిన్నప మాలింపుము.

ఆ॥ ఊరు దూరమయ్యెఁ జేరువయ్యెను సామి
పతినశించెదుఃఖ మతిశయించె

నిట్టి నన్నుఁ గోర నేమి సౌఖ్యంబగు
వలయు నేని తగినవారు లేరొ.

దుష్టబుద్ధి:—తరుణీ! నీకీ విరక్తి యేమిటికి నాతోడఁ గలసి సకల సౌఖ్యంబులఁ జెందరాదా నిష్కారణంబుగఁ (ప్రాణములేల హింసింపఁ జూచెదవు ఆనాఁడు మీతండ్రి) చాటిన స్వయంవరమున నిన్నుఁ గాంచినది మొదలు నేటివఱకు నీసుందరవదనారవిందము గాంచవలయునను కుతూహలమున నుంటిని నాకష్టము వృథా చేయకు.

చారు:—దురాత్మా! ఎంతజెప్పినను వినక యవాచ్యంబులనే బల్కుచుంటివిగా (అని కోపముతోఁ జూచును.)

దుష్ట:—(ఆశ్చర్యముతో) ఓసీ! నీచురాలా! ఏమని పల్కితివి. నీయిష్టముగా నడచుకొన వలయునని యుపేక్షించిన కొలంది నన్ను దృణమున కన్న నీచముగఁ బల్కుచుంటివి.

మ॥ అతివా యేటికి నాకుఁ జెప్పెదవు నీకై మంత్రివర్యుల్ జమూ
పతినిన్ జంపి జగత్ప్రసిద్ధుఁడగు నీప్రాణేశ్వరున్ నేఁడు దు
ర్గతి పాల్చేసితి నేమిచేయువలె నింకన్ నన్ను మోసించి యే
గతిఁబోనేర్తువె వాఁడు దిక్కగునె సౌఖ్యంబెచ్చటన్ గల్గెడున్

చారు:—ఆ॥ నాకనిత్యమైన లోకంబుపైగాని
యాత్మపైనఁగాని యాశలేదు
వ్యర్థముగను నేఁడ వాచ్యముల్ బలికిన
జంపకయ్య మున్నె చచ్చియుంటి.

నాయనా! లోకంబున మదోన్మత్తులై కన్నుఁగానక పరకాంతలఁ జెఱఁబట్టు దుష్టుల శిక్షింపఁదగిన నీవంటి పుణ్యులకు వావి వరుసలు విచారింపక పతివియోగంబున వెతనొందు నాబోటియబలలఁ

గామింపఁ దగునా దేహంబు రోసి మృత్యుముఖమునఁ బడుటకై లేచియున్న నా వలన నీకేమి సౌఖ్యము గలుగఁ గలదు.

దుష్టబుద్ధి:— (స్వగతము) ఏమి యీ టక్కులాడి నేనెంత సామము చేతఁ జెప్పినను వినకున్నది. (ప్రకాశముగా) కలికీ ! ఇఁక నా మాట వినుము చెడిపోకుము ఆసేతు హిమాచలమువఱకు దుష్టబుద్ధియని సార్థకనాముఁడనైన నాబారినుండి నిన్నురక్షించు వాఁడు లేఁడు. నాకుఁ గోపము దెప్పింపకుము.

చారు:—సీ॥ నాప్రాణ పదమైన తల్లి పాలవరుఁ జంపి
యేపాటియశము గడించినావొ
స్వామి హితుండైన ధీమంతుఁ బోకార్చి
యేపాటి యశము గడించినావొ
అపమానశూరుఁడా నాప్రభావునిఁగూల్చి
యేపాటియశము గడించినావొ
శాంతస్వభావులౌ సాధులహింసించి
యేపాటి యశముగడించినావొ
తే. అనదనై దిక్కులేకయున్నట్టి నన్ను
జెండి యేపాటియశమె గడింతుగాక
యేమిజేయఁగ నేర్చెదు హీనచరిత
చావునకు రెండుచావులు జగతిగలవె.

దుష్ట:—ఓహో ఎంతవైరాగ్యముతో బల్కుచుంటివి. బ్రతుకనేర్చిన దానవే. (తనలో) ఈకాంత నే నెంతజెప్పినను జెడచెవినిబెట్టి ప్రాణత్యాగమునకైనఁ దెగించుచున్నది. ఇఁక నాకోరికసిద్ధింపదేమొ. ఇంతట దీని విడచిపోదునా. కాదుకాదు దీనిబిడ్డలఁ

గూడ నరణ్యమునఁ జంపి రమ్మని నామితుఁ నియోగించితిని గదా. (ప్రకాశముగా) ఓసీకులటా! చావునకైన వెరవని నన్నీతఁ డేమిచేయునని యూ స్వధైర్యము ఇదిగో నాశపథము వినుము.

తే. నిరతమెవ్వారికై నీవు నీమగండుఁ
బరితపించుచునుందు రాచిఱుతలైన
కన్నబిడ్డలఁబట్టి చాగములకరణి
నరకి బలియిత్తు గాళికీనాఁడెగనుము.

అప్పటికైన నన్నుగూడ నమ్మతింపవా?

చారు:—హా నాబిడ్డలారా! మీకీ నిర్భాగ్యురాలికతన నకాలమృత్యువు వాటిల్లునా పరమేశ్వరీ! ఎంతవారి నెంతజేసితివి (దుష్టబుద్ధిని గాంచి) తండ్రీ! ఎంతవేఁడినను నీకు దయరాదుగదా. కన్నుల దెరవని నాపసిపాపల నేలచంపెదవు. వారు నీకేయపరాధముగావించిరి. నీకపరాధమొనర్చిన నన్ను జంపి నీ పగ దీర్చుకొనఁ గూడదా.

తే. చంపితివిమొందటనో మహాసాధువులను
చాలదే నీదు పాపిష్టిజన్మమునకు
మఱియు నాచిన్నిబిడ్డల మడియఁజేసి
యేమిసుకృతంబుఁజెందఁగ నెంచెదీవు.

దుష్ట:—(తనలో)

తే. ఒక్కతతిఁ బ్రబిచూలిన నక్కటికము
విడచి దూరుదురింకొక వేళయందుఁ
దమకుఁదా మరుదెంతురు తరుణులందు
కతన వారలరంజించి కలియఁదగును.

కావున నీకాంతచిత్తము కఱగునట్లు దైన్యముతో వేడుకొనుట మంచిది. (ప్రకాశముగా) కలికీ!

తే. అలరుపిలుకాని ములుకులై యలరు నీదు
వాలుఁగనులను ద్రాళ్ళచేవని తనన్ను
బంధితునిజేసి విరహాగ్ని బడఁగఁద్రోఁచి
పాపవనివల్కఁగా నీకుఁ జనునెయిట్లు.

తే. తరుణి తావకమృదుపదతాడనముల
కైన నోర్చెదఁగాని నేఁడంగభవుని
నిశితశరపాతములకు నేనిలువలేను
ప్రాణదానంబుఁజేసి పుణ్యంబుగొనుము.

పరిమళతుందబంధురంబగు నీ సుందరాంగంబుఁ దనివిదీర వదనికాసామర్థ్యంబునఁ జూచితినిగాని నీతనూదేశంబు నాలింగనంబు జేయు భాగ్యంబు లభింపదయ్యె. నేఁగావించిన దోషంబులనెల్లఁ బోఁద్రోలి మదనపిశాచగ్రస్తశరీరుఁడనగు నన్ను నీమృదువాక్యంతో ములఁ బవిత్రునిజేయుము. నీకై యిట్టి యకృత్యములాచరించిన నాయందుఁ బ్రసన్నవుగావేని వ్యర్థముగ రెంటను జెడినవాఁడనగుదును.

(అని సమీపమునకుఁబోవును.)

తారః—ఛీ యీదేహంబుతో నిఁక క్షణమైన నిలువఁగూడదు. ఈ దుర్మార్గుఁడు మాయోపాయంబులచే నన్ను మోసంబుఁజేయ యత్నించుచున్నవాఁడు. ఓ సకలలోకనిర్మాతవగు నోకాళికేశ్వరీ రాఁగల జన్మంబునఁగూడ తారా కనకశేఖరులనే బిడ్డలగను వీరసేనమహారాజుగారినే పతిగను నాకు దయసేయుము, నా కీనముద్రుఁడే శరణమగునట్లు కావింపుము.

(తారాకనకశేఖరులఁ దలంచుకొని)

అయ్యో బిడ్డలారా ! మీ కెంతగతి బట్టినది. (స్వగతము) క్షణ మైనను మిమ్ము విడచియుండఁగల నా? అట్టి మిమ్ము నెడఁబాసి నా మనో హారుఁగోల్పోయి మృతిఁబొందక యుండి కట్టినైన బ్రతికి యేమిలాభము.

(సముద్రము నుద్దేశించి)

చ. సతతము నీపదాబ్జముల సన్నుతిఁజేసెడి దాననేని శ్రి
తిత సకలారియా నృపతి శేఖరు బట్టఁపుదేవినేని యే
గతినయినన్ ననున్ ధరశికాంతుని చెంతకుఁ జేర్చినాదు సం
తతి యగునట్టి యా కనకతారనుఁ బ్రోవఁగ దే సరిత్పతీ.

(అని సముద్రమునఁ బడును)

దుష్ట:— ఓరా దీనిసాహస మేమనవలయును చూచుచుండఁగనే నా కన్నుగప్పి సముద్రమునఁ బడిన దే. (ఇటునటుఁజూచి) ఇఁక నాకిక్కడఁ బనియేమి. ఇప్పటికిఁగదా వీరసేను నికుటుంబము నాశముఁ జేసినవాఁడనైతిని. ఇఁకమీఁద నెదురులేక తిరుగవచ్చును

(అని పోవును)

(తరువాత వీరకేతువు కనకతారలతోఁ బ్రవేశించును)

కన— సీ. కటకటా యెట్టియిక్కట్టులఁ గూర్చితే
పసిపాపలకుఁ బాల పండ్లనాఁడె
తార— అయ్యయో కరుణ రాదయ్యనే నీమదిఁ
జిఱుతకూనలకిట్టి చెడుగుసల్ప
కన— అక్కటా మాకింక దిక్కెవ్వరగుదురో
ప్రాణముల్ నిలిపి కాపాడువారు
తార— అహో యిదేటి న్యాయంబో నోరెత్తుఁగని
కసుగందులనుఁజంపఁ గాఁదలంప

కన— శ్రితజనావనుఁడను పేరుఁ జెందినావు
తార— జగములకు సౌఖ్యములఁ గూర్పఁ జాలినావు
కన:— అట్టివేల్పవు నీకు మమ్మరసిప్రోవ
తార— నేర్పు లేదె రఘూ రమణీకళత్ర.

అయ్యో ! యీయానిర్జనారణ్యంబున మాకుదిక్కెవ్వరు. హాహా! తుదకిట్టి యిక్కట్టు గలిగెను. (కనకునిఁజూచి)

క. కలనైన నిరపరాధుల
నలమటఁజెందించి యొఱుఁగ మాకట్టా మనకీ
కలుషాత్ముఁడైన దుష్టుని
వలనన్ దుర్మరణమంద వ్రాసెనుగద రా.

కన—సీ. జనకుఁ బురక్షింపఁ జాలునంచనియున్న
నతఁడు రంభాశ్లేష మందినాఁడు
తార— జనయిత్రి మాకష్ట నమితిఁ బాపునటన్న
నామెయు నిడుమలలో మునింగె
కన— ధీమంతుఁ డఱుదెంచి తెఱఁగుఁజూపననటన్న
స్వామిమార్గమునసే జననతంతు
తార— వాహినీపతిదుష్టు వారించునను కొన్న
నాతఁడు నాకసౌఖ్యంబుఁ జెందె
కన—తే. చతురుదధివేష్టితావనీ చక్రమందు
గానరాఁడొక్కఁడేని రక్షకుఁడు మాకు
తార— చంపనో బ్రతికింపనో సరగనిపుడు
క్రూరుఁడవొ సాధువవొ నీదె భారమయ్య.

(అని వీరకేతువు పదములపైఁ బడుదురు.)

వీర:—ఓరీ! నీచులారా! మీరుపిల్లలైనను మీయుక్తిమాత్రము పెద్దది. ఇంతమాత్రమునకే యీవీరకేతువు మిమ్ములదయదలంచి విడచువాఁడుగాఁడు.

తే. నింద్యమేయగులేక యనింద్యమెయగు
గిల్బిషమెయగుఁగాక సుకృతమెయగును
వీరకేతుండుచిక్కిన వారివిడక
చంపుననుమాటయొకటి నిస్సంశయంబు.

కన:—(స్వగతము) ఆహా యేమివీనిపౌరుషము. రాచపాపలనియైనఁ దలంపక తనప్రతాపంబెల్ల మాయందేచూపుచున్నాఁడు.

తార:—అయ్యా! పసిపాపలముగదా. నీకేమిద్రోహముసల్పితిమి. దాయాదియగు దుష్టబుద్ధివలె నీవును మామీఁద నేలకోపించెద వు. అయ్యో నీవును బిడ్డలఁగన్నవాఁడవేకదా. తలిదండ్రులు లేని యీకూనలవిడచి పుణ్యముఁగట్టుకొనుము.

చ. జననుతమార్గమున్విడచి సౌఖ్యమె శాశ్వతమంచు నెంచి మా
జనకునిఁజంపి క్రూరుఁడయి సజ్జనగర్హితుఁడైన దుష్టబు
ద్ధినిగని మమ్ముఁజంప వెనుదీయవదేమియొ క్రూరకార్యమున్
బనివడదేటికయ్య పరిపంథులమా గణియించిచూడుమా.

వీర:—ఓసీ! నీమిట్టవేదాంతములు నాముందర సాగిరావు. ఇదే ఖడ్గమువలన మీశిరంబులఁ దెగవేసెదను. మీ యిష్టదైవములఁ దలఁచికొనుఁడు

(అని కత్తినెత్తును) (తారా కనకశేఖరులు మూర్ఛపోదురు)

వీర:—(ఆలోచించి) ఔనౌను. పాపమీ చిన్నపాపలఁ జంపినలాభమే మి. యేనాఁడీశిశుహత్యగావించితినో యీనాఁడు నే సపుత్రకు

వియోగము కలిగినను మాసోదరియైనను నాకుఁ దోడుగనుం డుఁగదాయని యీ కష్టసాగరోత్తరణమున ధైర్యము కలిగి యుంటినే. ఆమెను గూడఁ జంపి యీ దిక్కుమాలిన నన్నేమి చేయఁ దలంచితివి. [నలువంకలఁ జూచి] ఇందెక్కడను గ్రుక్కెడు నీరుఁగూడఁ గానవచ్చుట లేదు. [ముందునకు నడచి] అదిగో అక్కడ నేదియో యొక కొలనున్నట్లున్నది. అటకేగి సలిలంబుఁ గొనివచ్చెదఁగాక.

[అని నిష్క్రమించును.]

తార:— [మెల్లనలేచి కనకునిగానక] అయ్యో దురదృష్టమా! మా సోదరుఁ గూడ నెడఁబాపితివా!

[ఇటు నటుఁ జూచి అంతను వెదకుచు]

సీ. కనరుగదామీరు గగన సంచరులార
కనకునిజాడ నెక్కడనుగూడ
అనదనే నాకుసాయము జేయఁగూడదో
జలదమా మీవంటి సాధువులకు
మారాడినంత మీమహిమఁ గోల్పడుదురా
హరిణంబులార యీ యబలతోడ
నాకష్టములఁజూడ నీకైన దయరాదె
కననియట్లుండఁ గాంచనమయిపుడు;

తే. అకట యేదిక్కులేక మీయండఁ జేరి
బ్రతుక దలఁచిన మమ్మోడఁ బాపఁదగున
గహన దేవతలార యొక్కరునుగూడఁ
దెలిసి దాచరు గద కమ్మ తెలుఁగుమీరు.

అయ్యో దైవమా! ఈ యరణ్యమం దెక్కడనని వెదుకగలను. దాహముచే మూర్ఛపడిన నాకైసిరు దేనెచటికైనఁ బోయెనా? ఇప్పటికి నేమూర్ఛపడి చాలసేపైనదే. అట్లుపోయిన కనకశేఖరునే దేని క్రూరమృగము వాతవేసికొని యుండదు గదా. ఆహా దుర్విధీ యెంత దిక్కుమాలిన దానిగ జేసితివి. [అని వెతకుచుబోవును.]

ఇది ద్వితీయాంకము.








శ్రీ

మీనాక్ష్యై నమః.

# విషాదకనకతారీయము.

## తృతీయాంకము.

రుద్రదేవుఁడు:— ప్రవేశించి ముందునకుఁజూచి

సీ. ఏదిక్కుఁగాంచిన నెటిదీర్ఘతరములై
క్షితిఁ బ్రాకెడి కొండశిలలపిండు
ఏమూలఁ గనుఁగొన్న నింతమించుగఁ బర్వ
తములమించెడి మదేభములసంచు
ఏవంకఁ జూడఁగన్నఁ బ్రోవులై చేరి యు
య్యాల లూగుచుండు కోతుల మెలుంగు
ఏచాయఁ గాంచిన హృదయభీకరములౌ
నారావము లొనర్చు క్రూరమృగము

తే. లేకడఁ గన్నఁగానిన గాకవిచయ
కలకలంబు లెచటఁ గన్నఁ గర్కశాశ్మ
పరివృత ప్రదేశంబు లీ వనమునెట్లు
గడచిపోవుదు నీ సందెకాడ నేను.

మఱియును —

చ. ఇనుఁడలచక్ర సంతతులనేలి తమంబుహరించి వృద్ధుఁడై
తనకలుషంబువాయఁగ నెదన్ దలపోసి తపోభిలాషచే
జనియెజగం బరాజకముసల్పి నృపుల్ తుదమోక్షకాములై
చనుటనిజంబటంచెఱుక సల్పెడి రీతినిగంటె ధీవరా.

మంత్రి ! ధీవరా ! ఈమహారణ్యమున గమ్యస్థానమునకు మార్గంబుగాన్పించుటలేదు. అడిగి తెలసికొందుమన్నను మనుష్యమాత్రుఁడొక్కఁడును గానరాఁడు. (సమాధానముగానక వెనుకకుఁదిరిగిచూచి) ఏమిదీ ధీవరా ! ధీవర ! ఓహో వేఁటకాండ్రు దారితప్పి విడఁబోయినట్లే ధీవరుఁడును దారితప్పెనా! ఔరా యెంతమోసము సంభవించెను. సాయంకాలమగుచున్నది. మార్గమూ తెలియదు. ప్రాణము గాఁచికొనుదునన్నఁ జేత నొకకోలయైనలేదు కట్టా ఈనాఁడు వేఁటకుఁగవలదని నాప్రాణేశ్వరి యెంతవేడినను వినక వచ్చినందులకుఁ దగినప్రాయశ్చిత్తమైనది. అబ్బా యిది సముద్రతీరప్రదేశముకాఁబోలు. గ్రీష్మగ్రుంభితతీవ్రమైనను సహస్రభానుని కరసంతాపముమాత్ర మునుగలేదు.

ఉ. నాలుక యెండిపోయెఁ జరణంబులు నిప్పులఁద్రొక్కినట్లుగా
గాలుచునుండెఁ జెమ్మఁగిలె కాయమునత్వముతగ్గ క్షుత్పిపా
సాళియతిక్రమించెఁ దపనాహతికోర్వఁగ నేర్చు శిట్టులీ
వేళయెుకండ నేను వనవీథిజరించుచు నిర్భయంబునన్

(ధైర్యమవలంబించి)

తే. సృష్టికర్తకెట్టు లిష్టమైయుండు న
ట్లవని జరుగుగాని యన్యమగునె
దైవయోగములను దప్పింపఁగలవారు
మూఁడువేళలందుఁ జూడగలరే.

ఇంక నా పట్టణమునకెన్నాళ్ళకుఁ బోఁగలుగుదునో కదా.
అకటా రాజ్యలక్ష్మీ.

సీ. సత్యహరిశ్చంద్రు సాధుసాహుద్వయ
సాధాగ్రములఁ గ్రీడ సల్పినావు
నలమహారాజు నిర్మల శాసనంబున
వసియించి సుఖములఁ బడసినావు
పాండవాగ్రజు ధర్మపరిపాలనమున
నిశ్చింతతో మదినంతసించి నావు
బుధకుమారుని పరిపూర్ణ గౌరవమున
క్షాత్రమవై వృద్ధినందినావు

గీ. ఎందరో రాజవర్యుల హీనభక్తి
నహరహము నీకు సేవల నాచరింప
నలరితివి నేటికీ మృగయాకతమున
రహిఁదొలంగితివే నన్ను రాజ్యలక్ష్మి.

చ. నిరతము వందు నీకొఱకు నిశ్చలతన్ దపియించువానిపై
యరుచిని జెందిపీడిచని దారవివేకము లేక లుబ్ధుఁడై
తిరిగెడివాఁడె నీకుఁ దగుదిట్టరియాఁగద రాజ్యలక్ష్మియే
తరణినిజూడనిట్టి కలికాలమునందున మంచియున్నదే.

ఆహా నీవొకచో నిశ్చలవై యుండవు గదా.

చ. సరసులపై నఁగోపము వహిస్కులఁగన్న నసహ్యమాకమా
భరణులమీఁదభీతి శ్రితపాలకులం దనురాగశూన్యవై
వ్వారికడ నెవ్విధంబిక నివాసమొనర్చెదు రాజ్యలక్ష్మి యం
దరుఁ బగవారలైన వసుధాతలి నిల్వఁగఁ జోటుగల్గునే.

ఏమి యీ వెఱ్ఱి నా దురదృష్టంబునకుఁ జంతిలకఁ బవిత్రయగు రాజ్యలక్ష్మిని దూరుచున్నవాఁడ.

సీ. కామమా యింక నెక్కడకైనఁ జనరాదె
నన్నిడనాడి కొన్నాళ్ళపాటు
క్రోధమా నీయునికి గూడదా వేరుచో
పరమనిభాగ్యుని వంచదక్క
లోభమా యేరీతిగా భరింపఁగనేర్తు
నిన్ను నన్నడఁబాసి నిలువలేవు
మోహమా యింతేనియూహలేదయ్యె
నీయభివృద్ధి మార్గంబు నరసికొనఁగ

గీ. మదమపదపడినీకు నమ్మదము గలుగు
పదములెదుకంగఁ బొమ్మిమీ పదముఁ బొలఁగిన
మత్సరమనీకు నేఁదక్క మహిని కంను
గలుగఁడే చెట్టఁబట్టి సుఖంబు జెంద

ఓ శత్రువులార! మీ ఫలంబులేని యాశ్రయంబు వలన నేమి సుఖము మృగయాభిరతిచే నేను మోసమొందినట్లు నాయందలి యనురాగముచే మీరును మోసము జెందనేల (తలయెత్తి యాకసమువంక జూచి) ఏమి యీ యనాత్మజ్ఞత నన్ను బాధించు నీయరిషట్కంబున కుపదేశము జేయుచుంటినేల వీనిని జయింప సామాన్యులకువల నుపడదే.

సీ. కామంబుచేత శంకరునంతటి మహా
త్ముఁడ భాగమందున నతివఁజేర్చె
క్రోధంబుకతన శ్రీనాధునంతటివాఁడు
తనకీయవచ్చు భూధవునడంచె

లోభంబుకలిమిమై లోకేశునంతటి
వాఁడు సృష్టిని బతుపాతమూనె
మోహంబునకుఁజిక్కి పురుహూతునంతవాఁడల
తపోధను భార్య నంటుకొనియె.
గీ. మదమునన్ గురుకులమెల్ల మంటగలసె.
మత్సరంబున నహుషుండు మహినిజెడియె
కాన నెవ్వారికైనగాని దుష్ట
శత్రువర్గంబు గెలువంగ శక్యమగునే.

లోకంబునెల్ల వ్యాపించి తమ కెదురులేక సంచరించునట్టి యరివర్గంబు గెలువ నేనెంతవాఁడ [ముందునకు నడచి] ఆహా విధిని యుంగఁ దరముకాదు గదా.

ఉ. ఒక్కనిమీదపై నిలుపు నొక్కనిభూమికి నేతఁజేయువే
రొక్కనిగౌరవించు మతియొక్కనిగూటికి లేనివానిఁగాఁ
జెక్కువిధంబులన్ సలుపుఁ జెప్పెపియుంచు జగంబుదూరగా
నక్కట సృష్టికర్తకిటుల వాణె మొయీడగువారు నెవ్వరే.

అందునకు
గీ. తమకు ధర్మంబెజయమని తలఁచియెట్టి
కష్టములుగల్గిన సహించికాలమునకు
గట్టుఁబడియుండువారి పైకరుణలేక
సంచరించెడుగద పద్మసంభవుండు.

[తండ్రినుద్దేశించి]
తే. ఎల్లవిధముల నాయభివృద్ధి కొఱకె
పాటుఁబడునట్టి నీదురవస్థఁదలఁచి

నవ్వుడెల్లను భరియింపనలవిగాని
కష్టమెదనీదు సుతునకుఁ గలుగుఁ దండ్రి.

చ. ననునిముసంబయేని విడనాడక నాహృదయంబె యున్కిగా
నొనరిచికూర్మితోడ నిఖిలోపకృతుల్ బచరించునట్టి నా
వనితవిచారముస్ దలఁపవారని దుఃఖముగల్గుచుండు నే
మనివచియింతు నన్బతిగనందుటకా చెలి పాపమెట్టిదో.

చ. నిరతము బ్రాణపంచకము నీవయిపెట్టి సమస్త మీవెయం
చరసిచరించు నీపితరులక్కట నీకపరాధ మేమి చే
సిరొ యిసుమంతయుగా దెలియఁ జెప్పకపోయితి త్వద్వియోగమే
కరణి సహింతుమయ్య కొడుకా విధినేమని దూరనేర్తుగా మో.

మఱియును.— 7/43

చ. కొడుకు సమర్థుఁడై తమకుఁ గోరినదానినయెల్లఁ దెచ్చి పె
ట్టెడు గదయంచుఁ బేర్మిమియెంకిని వీడకయుంటి మిప్పుడి
ట్లిడుమలఁ దెచ్చిపెట్టి విధియేకిగ్రియ దీని భరింపనేర్తుగా మా
పడఁతియె వాఁడు దిక్కుగు న పత్యవియోగముఁ జక్కఁద్రోయఁగ

అని చింతించు నా తలిదండ్రులఁజూచు నదృష్టమీందీనునకుఁ
గల్గునో లేదో కదా.

తే. కష్టనిష్ఠురములకోర్చి కాయమెల్ల
జీర్ణమైననుగాని నీ సేమమునకె
పాటుఁబడితిగదా యిట్టిపాటుఁగూర్చి
కొనఁదోసితె ధర్మమా కానలేక.

(ముందునకుఁజూచి) ఏమది నీలనీరద ప్రభాసన్నిభమైయుగాంత
నమయ ప్రకటితమేఘ గంభీర నిఘోషమట్లు దిక్కులు బ్రద్దలగ

నట్లగుచున్నది. ఏదియేని ఘాతుకమృగము కాదుగదా (ఆలోచించి) కాదు కాదు. అది సముద్రము గానున్నది. అంట కటిగి యా మహాత్ముని దర్శన లాభంబు జెందెదగాక. పిమ్మట యెట్లైనను మంచిదియె (అనినిష్క్రమించును.)

(రుద్రదేవుఁడు ప్రవేశించి) సముద్రము నుద్దేశించి)

రుద్ర:—

సీ. ఆదివిష్ణునకుఁ గన్యాదాన మొనరించి
వంశద్వయంబు బావనముజేసె
నాకోన్న దేవతా నీకంబునకు నమృ
తంబు నొసంగి సంతసముగూర్చె
శరణన్నమాత్రి గాత్యాయ నీ సోదరు
నభయంబునిచ్చి భయంబుఁబాపె
దాక్షాయణీభర్త కత్తుయుండగుఁ జందు
నిడిసంతతంబలం కృతుని జేసె,

గీ. నే మహా మహాండతని నదీశ్వరుని ప
విత్రమగు దర్శనమునఁ గిల్బిషమువాసి
నాకకాంతీ పరీరంభణంబుఁ జెంది
యధిక సుఖమొందడే యెవ్వఁడైనఁ గాని

ఆహా పూర్వజన్మమున నెట్టిసుకృతము జేసిననోకదా యీయుదధి నాథుని దర్శించు భాగ్యంబు గలుగుట చంద్రమండలము నందుకొనన నోయన నూర్ధ్వగాములై యొకదాని వెంట నొకటి విలంబము లేక యెగిపడు నీయుత్తుంగ తరంగ మాలికలఁ గాంచిన వాని యభిప్రాయ విశేషంబు నుడువ శక్యమా అవిగో కొంతదవ్వున నీ రత్నాకరేంద్రు నియభంగురమైన సాంగత్యంబుఁ గోరి నేను నేనని రభసంబున భాగీర

ధ్యాది సరిదగ్రిత్నములు వచ్చిపడుచున్నవి. ఈనదీ సంతతికింత యుదే్రికమెందులకో. (ఇంచుక నేపూరకుండి)

అవును. తే. కాన్యుకుబ్జ నగ్రివ్య మొక్కటిగానఁ బడిన
నవనిజనులెల్ల మాకు మాకనుచు మనసు
నిలుపఁగాలేక ముందంజ సలుపుటది స్వ
భావసిద్ధంబెయగు నబ్రిపడగనేల.

ఈ విరించి ప్రపంచంబునఁ గలుగు విచిత్రింబుల వర్ణింప నాది కవియగు వాల్మీకికిఁ దక్క సామాన్యులకు శేర్పుజాలుగా. ఉత్తమకులీనుఁడగు కీసరిత్పతి తన దర్శనంబునకై యరుదెంచిన నాకు గౌరవము జేయుటకుఁ గాబోలు వివిధంబులగుఁ బుష్పసౌరభములతో నిజశీకరములఁ గూర్చి మలయ కుమారుని బంపుచున్నవాఁడు. ఉన్నతుల గుణము లిట్టివేకదా (ముందునకు నడచిచూచి)

ఉ. పండుగ వాసరంబులఁ బ్రభాయుతులై తను గొల్వవచ్చునా
ఖండలముఖ్యనిర్జర నికాయము నిల్చెడి పట్టులేమొ యీ
రెండతటిక్ దనర్చెడి తదీయపదాంబుజ చిహ్నితంబులై
మెండగు స్వర్ణ రౌప్యముల మేళనమట్టులు సైకతంబులన్

ఈ మహాత్ముని దర్శనంబు తలవని తలంపుగఁ గలిగినందులకు నాకెంతయు సంతసమేయగుఁగాని నామంత్రిసత్తముఁడగు ధీవరుఁడైనను నాకు సహాయముగనున్న నీ దివశేషము హాయిగ నీపాంతో ద్యానములఁ గడపుదుఁగదా. అయినను వెదకిచూచెదఁగాక (వెదకుచు) (సంతోషముతో) ఏమి మంత్రిప్రుంగవుఁడా ఆఁ.

ఆ. నావ్రతముఫలించె రాజన్యసార్ధక
మయ్యె నన్ను సౌఖ్యమాశ్రియించె

నాకు శ్రేయమయ్యె నాతొలి పుణ్యంబు
మూర్తిగా దాల్చెనాకు మోదమెనఁగ

(అని ధీవరుని కౌఁగిలించుకొనును.)

ధీవ:—మహారాజా! మీరా సింగంబును దఱుముకొని వాయువేగం బునఁ బోవుచుండ మీవెనువెంట వచ్చుచు మిమ్ము గలిసి కొనలేక మీకై తిరిగితిరిగి యీ సముద్రప్రాంతంబున నేమైన తమ జాడ తెలియునేమోయని భగవధ్ధ్యానము జేయుచు నిట కరుదెంచితిని. నాతప్పు క్షమింపుఁడు (అని పదములపైఁ బడును.)

రుద్ర:—(మంత్రిని లేవనెత్తి) ధీవరా! ఇంకు నీదోషమేమి నాతరుణీ రత్నము వలదన్నకొలఁది వచ్చినందులకు మనకుఁ గడుం గడువెతలు గల్గినను మహానుభావుఁడగు నీసింధురాజు దర్శ నము గలిగిన కతన నవియెల్లను విస్మృతములయ్యె కాని మన సైన్యమెల్ల నేమైపోయెనో తెలియదుగదా.

ధీవ:—తెలియకేమి మహారాజా! సైన్యమునంతయుఁ బురంబున కేగునట్లు నియమించితిఁగదా.

రుద్ర:—అవును మఱచితిని.

ధీవ:—దేవ! సూర్యుండస్తగిరి శిఖరంబు నలంకరించెను. ఈ రాత్రి కిందుశయనించి రేపటిమార్గము వెతకుచుఁ బట్టణంబున కరుగుదము.

రుద్ర:—అట్లేకానిమ్ము (ఇరువురు నందొకచో శయ్యఁ గల్పించుకొని శయనింతురు.)

రుద్ర:—(లేచి కూర్చుండియుండి) అమాత్యా? చూచితివా.

సీ. పతివియోగము సహింపఁగలేక వెతఁగొంచు
బన్నిపే సతి కేశపాశ మనఁగఁ
గువలయేశ్వరుఁడు తన్గూడ వచ్చునటంచు
యామినికై సేయు నంజనమన
తాపింఛ వృతసంతానావృతంబునై
గొనబారు కాటుక కొండయనఁగ
రమణీ జనజయోత్సవము గాంచఁబోయెడి
మనసిజు బండికందెనయనంగ

ఆ. ఖంజరీటకాల కంఠకంఠచ్ఛవి
పుంజమాయనంగఁ బొలుపుఁగాంచి
కృష్ణనపయశోధి విష్ణునిఁగాఁ జేసి
యిరులు గ్రమ్మె జగతినెల్లకడల,

ధీవ:— దేవ! అటుఁజూడుఁడు.

తే. కువలయేశాగమన మహోత్సవము చేత
గగనరమమహార్తి కోజ్జ్వల కాలకంచు
కము దొడఁగెనన జలదసంక్రాంత పుష్క
రమునఁ దారావళిదనర్చె రమ్యముగను.

రుద్ర:— (ఇంచుకసే పూరకుండి దక్షిణంపుఁదెసఁ జూచి) మంత్రీ!

తే. పరిమళచ్ఛంద నాచల వసుమతీజ
కుసుమ సంతానరజము గైకొనిన కతన
మందగమనుండగుచుఁ బవమానుఁడదియె
సరఁగ వచ్చెడు మనపథశ్రమమునడఁప.

ఆహా మలయానిలునకు జగత్ప్రాణుఁడను బిరుద మొసంగిన వారెవరో యనుభవజ్ఞులే.

శివ:—దేవ! అటుఁజూడుఁడు విరహిణీజనమార్గణోద్యమమునకై బయలువెడలు పంచశరుని శ్వేతచ్ఛత్రమో యనఁ గ్రమంబున చంద్రబింబమెట్లు ప్రకాశించుచున్నదో.

హరి:—అవును మేనయల్లుఁడగు కందర్పునకు సాయము చేయ నెంచుచున్నవాఁడు కాని సాక్షాద్దోషాకరునియందు గౌరవము లేదు. ఏలనందువా?

సీ. ఆదరంబున రమ్మటంచుఁ బిల్చినయంతఁ
గృత్తివాసుని తలకెక్కినాఁడు
ఆచార్యుఁడై తనకన్ని విద్యలఁ జెప్పు
గురునకు ద్రోహంబు గూర్చినాఁడు
సోదరుఁడని దయఁజూపుచు నుండిన
భగినిగేహము భంగపరచినాఁడు
రాజితఁడని తమ రాజ్యమొసంగిన
చక్రసంతతి వెత సల్పినాఁడు
గీ. క్రూరుఁడై యీచెనఁటి నేతిబీరకాయ
యట్టులి నిలరాజ శబ్దంబు నందినాఁడు
కాకయుండిన సద్గతిఁ గాంచలేఁడొ
యితనిచే బాధపడనివా రెవరు చెప్పుము.

ధీవ:—అయ్యా! కువలయేశ్వరుండగు నీరోహిణీ పతిని వృథా నిందించుట కాముకులకుఁ గాక మీవంటివారికిఁ దగునా! ఈ మహాత్ముని మూలమునఁగదా సకల జగంబులు సుఖంబుగ మనియుండుట.

రుద్ర:—ఓయీ! శీతకరుఁడను మిథ్యాభిధానంబుఁబూని పయోముఖవిషకుంభమట్లెల్ల వారికి విశ్వాసంబు గలిగించి సంతాప

యొనరించు నీశశధరునిపై నీకభిమానమేల ? అతనిదోడుగ.

తే. పతుల నెడఁబాసి వెతఁగుందు సతులనబల
అనితలంపక నేచుచు నమ్మ్రయిల్లు
గోలఁగాఁజేసి కనరాక కొట్టుచుండు
గలువమతియు గుమారుఁడును గలఁడునుమ్మ.

మఱియును.

చ. అలఘుఁ చరిత్రుఁడైన తనయగ్రజుఁ డస్తమయంబు జెందఁగాఁ
గలువమటంచు లోఁదలఁపక జెలరేగి సదావియోగినీ
వధీ:-కలితమనస్కుఁడై చెనఁటికర్జములన్ బచరించుచుండువాఁ
డలసుఁడితండు వీనియెడ నాగ్రహముందిన నాకుఁదోషమే.

ధీవ:—(స్వగతము) ఇప్పుడీ మహారాజుగారు విరహావేశంబున లోకనాయకులగుఁ జంద్రమన్మథుల దూరుచున్నవారు. కావున నెట్లైన వీరినీప్రసంగంబునుండి మరలించెదగాక (ప్రకాశముగా) దేవా! నిమానుష్యంబులగుఁ దమశాత్రవ నగరంబులఁ బోలి యీయరణ్యము నిశ్శబ్దముగా నున్నయది. మాగాఁ యానంబున నలసిన కామించుక మెత్తని పూసెజ్జలవలె రాలిన పండుటాకులపై నిదురింపుఁడు నేనును శయనించెద.

(రుద్రదేవుఁడట్లు జేయును ధీవరుఁడును బవ్వళించును.)

చారుమతి.—(ప్రవేశించి) ఆ పల్లెవాని దయవలన మొసలి నోటిఁ జిక్కినను బ్రతికి దరిజేరితిని. ఇట్టిరాత్రింబున నెక్కడకని యేఁగఁగలను. మఱియు నింకెట్టి కష్టములు గలుగనున్నవియో! ఏమీ యీ తెలివి తక్కున. రోటఁదలఁబెట్టి రోకలిపోటునకు జడియనేల. ఓరా కాలమహిమ!

చ. నిమిషమయేని నన్ విడువనేరక వ్యాజములేని ప్రేమచేఁ బ్రా
ణమువలె నాచరించుచును నన్నఁ జేతులలోనఁ బెంచు నా
రమణుని బాసి యివ్విధి నరణ్యముపాలగుదంచు నెన్నఁడే
నిమిషమునైనఁ దలంచినానొ ధరణిన్ విధివ్రాఁత నెఱుంగవచ్చునే.

(బిడ్డలఁ దలఁచుకొని) అయ్యో బిడ్డలారా ! మీ కెట్టి నీచపు మరణము సంభవించెను.

సీ. నా ముద్దు చెల్లించి నను బ్రోతురనుకొంటి
నింతలో నిటులౌట నెఱుఁగలేక
నాప్రోల నివసించి నాకు సౌఖ్యముగూర్తు
రని యెంచితిటులౌట నరయలేక
నాచెంతఁ బెరిగెడి నాతపఃఫలములం
చిలనంటి యిటులౌట దలఁపలేక
నాయానతిని దాటి యేయాగడము సేయ
రని యెంచితిటులౌట గనఁగలేక

గీ. అమ్మయని పిల్చి నన్ను మీరహరహంబు
ముదము జూపుదురనుచు నేమురియుచుంటి
నక్కటా పదియేండ్లప్రాయమునకపుడె
మరణమాసన్నమగుట మీ కెఱుఁగలేక,

చిరకాలంబునకుఁ గాళికావరంబునఁ గలిగితిరని యెంతయో ప్రేమతో మిమ్ముఁ బెంచుకొనుచుంటినే. అట్టి నాకడుపునఁ జిచ్చు పెట్టి పోయితిరా! మేలిమిబంగారమునకన్నఁ బ్రకాశించు మీ సుందర రూపంబుల నింకనెన్నఁడు గాంచఁగలుగుదును. మిమ్మా దుర్మార్గుఁడు నఱకినపుడు నన్ను గూర్చి యెంత విలపించితిరో గదా. అయ్యో బిడ్డలారా ! (అని యేడ్చుచు దిరుగుచుండును.)

రుద్ర:—(కన్నులు దెఱచిచూచి) ఏమి యీధ్వని. యెవరో యేడ్చుచున్నట్లున్నదే మావలె గ్రహముచాలనివా రెవరోకదా పాపము. కానిమ్ము విచారించెదఁగాక. (అని మెల్లనలేచిచారుమతిని గాంచి) ఈమె యెవరు. వనదేవత కాదుగదా కాకున్న మనుష్యమాత్రు లీయరణ్యమున సంచరింపఁగలరా? ఆహా ఆ చక్కదనమేమని వర్ణింపవలయును.

క. స్తనములకు నురముచాలదు
కనుదోయికి మొగముకొలఁదిగాఁగన్పడెడిఁ
ఘనమగు నీసతి వేణికి
వెనుకటి భాగంబు తక్కువే యగునుజుమీ.

ఏమి యీ తెఱవ చక్కదనము. క్షణమాత్రమున నామనంబు తాఁగికొనినదే. ఇట్టి కాంతారత్నమున కీయరణ్యవాసము గలుగుటకుఁ గారణమెద్దియో అడిగి తెలిసికొనెదఁగాక. (సమీపించి)

ఉ. ఎవ్వరిదానవీవు నళినేక్షణ నీకులమెద్ది దేనికై
యివ్వనిఁ జేరితీ వెతల నెవ్వఁడు గల్గఁజేసె నాకు నీ
జవ్వనముం గనుంగొనఁగ సంతసమయ్యెడి దేవకాంతవో
ఎవ్వఁడదృష్టహీనుఁడయి యిట్టుల నిన్విడనాడెఁ జెప్పుమా.

చారు:—అయ్యా నేనొక యభాగ్యదేవతను నాపురాకృతదోషంబున మగనిని బిడ్డలను గోలుపోయి చావుకకు దూరమై కష్టములకుఁ దోఁడకోడలనయి దిక్కులేక తిరుగుచుంటిని.

రుద్ర:—(స్వగతము) ఈకలికి వృత్తాంతము జూడ దిక్కులేనిదిగఁ దోచుచున్నది. కాన నీ కాంత నావెంటవచ్చునేమో తెలిసికొనెదను. (ప్రకాశముగా) తరుణీ! నేనొక రాజకుమారుఁడ నామంత్రియు నేనును మృగయాకుతూహలంబున నరుదెంచి

ప్రొద్దుగ్రుంకుటచేత నిందు విశ్రమించితిమి. ఇట్టి యరణ్యముల వెతలఁ గుడువనేటికి. నన్నుఁజెట్టవట్టి పట్టమహిషివగుదువు నావెంట రమ్ము. మనుష్యలోకంబునఁ బుట్టిన ప్రతివానికిని సౌఖ్యమనునది ప్రధానకామ్యముగదా.

దారుమతి:—(స్వగతము) ఎక్కడఁజూచినను నశ్రావ్యంబులగు నీ దుర్వాక్యంబులె వినఁబడుచున్నవి. ఎంతకాలమని యీదరిలేని శోకసాగరంబు నీఁదగలుగుదాను! ఛీ యీ యాఁడుపుట్టుకకన్న వ్యర్థమగు జన్మ వేఱొకటి లేదుగదా.

చ. చక్కఁదనంబెయున్న రభసంబునఁ బట్టి భుజంగులెల్లరున్
దిక్కువిధంబులన్ వెతలఁ బెట్టుచునుంద్రు కురూపయైనచో
నక్కట భర్తయొల్లకయహర్నిశముల్ విసుగొందుచుండు నిం
కెక్కడిసౌఖ్యమేటి బ్రతుకెక్కడి వైభవమాఁడు వారికిన్.

(ప్రకాశముగా) అయ్యా! మీవంటి మహారాజులకుఁ బరకాంతలఁ గోరఁదగునా! దుష్టశిక్షయు శిష్టరక్షణము జేయఁదగిన మీరిట్టి కార్యములకుఁ దలకొన్నచో లోకంబు నిలువఁగలదా. జగంబునకుఁ దండ్రులగు మీకు బిడ్డనుగదా. అట్టినన్నుగోరిన పాపంబుగాదే

రుద్రు:—కాంతా! నామనోధనంబు దొంగిలించిన నిన్ను గలిసిన దోషంబు గలుగునా. అట్లు తలపోయకుము. వ్యర్థముగ నీసోయగము నెందులకుఁ బాడుచేసెదవు. నాపాణిగ్రహణంబు సల్పితివేని నీకు స్వర్గముకన్న నెక్కుడు సుఖముఁ గూర్తును. నిన్ను గాంచినప్పటినుండియు మదనుఁడదనని పదనగు దూపులచే నాయెదనొప్పించుచున్నవాఁడు. నీవాలసించితివేని నాప్రాణంబులు నిలువవు ప్రాణరక్షణముకన్న ముఖ్యమగు కార్యంబొండుగలదా. (అని పట్టుకొనఁబోవును.)

చారు:—ఓరీ! దుర్మార్గుఁడా నన్ను ముట్టరాకుము. రాజ్యామదముచేఁ గన్నుగానక చెడిపోఁదలంపకుము. (కాళికాదేవి నుద్దేశించి) ఓ భగవతీ జగజ్జననీ ! కలలోనైన నను నీధ్యానము విడవనేని నేను సాధ్వినని నీకు నమ్మకముండునేని యీదురాచారుని సంహారించి నీదాసిని రక్షింపుము (రుద్రదేవుఁడొక బాణము దగిలి నేలఁగూలును చారుమతిఆశ్చర్యమునఁ జూచుచుండును)

భీమదాసు:—(ప్రవేశించి) అమ్మా! సాధ్వీమణీ! దిక్కులేకయీకానన మున నొంటి దిరుగనేమిటికి నీవుజూడ కష్టముల కోర్చుదానవు గావు నేను కాళికాదేవికి భక్తుఁడగాన నీకుఁ బుత్రువంటివాఁడ నగుదును నాకుసంతానములేదు బిడ్డలట్లు నిన్నుబెంచెద మా యింటికిరమ్ము.

చారు:—తండ్రీ! నీవుచెప్పు మాటలలో యదార్థ మెంతయో నాకు నమ్మకము గలుగలేదు. నన్ను కష్టపెట్టినను సుఖపెట్టినను శాస్త్రదూష్యములుగాని కార్యములకు నియోగించనట్లు ప్రమాణముజేసితివేని మీయింటికి రాఁగలను.

భీమ:—తల్లీ! నీకనుమానమేల నాకులదైవంబగు కాళికాదేవిసాక్షిగ శాస్త్రదూష్యములగు గార్యములకు నిన్ను నియోగించనురమ్ము.

చారు:—(ధైర్యముతో) తండ్రీ ! దారిఁదీయుము.

భీమ:—ఇటుఇటు (ఇరువురు నిష్క్రమింతురు.)

కనకశేఖరుఁడు:—(ప్రవేశించి) అయ్యో యీమహారణ్యమున నాసో దరినెక్కడనని వెదుకఁగలను— ముందునకుఁ బోవుదమన్న మా ర్గముగూడ గానవచ్చుటలేదు—ఆహా వనదేవతలారా! మీరైన ను మా తారావళి జూపఁగూడదా ? పరస్పరము గలిసికొని

నట్టమధ్యాహ్న మందైనను జీఁకటి గలిగించు విశాలములగుఁ దరు శాఖలు దట్టముగా నల్లుకొనిన గచ్చపొదలలో గుత్తున బుసపెట్టి నిద్రించు క్రూరసత్వంబులును కుబుసంబుల విడచి పడగలనెత్తి యాడు కాలసర్పంబులును నా ధైర్యంబునకుఁ గొఱఁత గల్గించి యడుగుదీసి యడుగుఁబెట్టుటకును సాహసింప నీయకున్నవి. సోదరీ! నీకాపాపిష్టిదాహమేల గలుగవలయును- కట్టా దైవమా!

ఉ. దప్పియటంచుమూర్ఛవడి దల్లడమందుచు నున్నఁగాంచలే
కిప్పుడెనీరుగ్రైకొని యహీనగతిన్ జనుదెంతు నంచునే
నప్పగిదిన్ జనంగ నెవఁడైననుదుష్టుని లెంకవచ్చి మా
యప్పనుబట్టి చంపఁడఁగదా విపినంబునఁబాపచిత్తుఁడై.

సీ. జనియించి నదిమొదల్ జనయిత్రిచెంతల,
నల్లారుముద్దుగ నాడినాము
ఆహారమం బొకచోట నాటపాటలలోనఁ,
దెరపక కలసి వర్తించినాము
జనకుండు పరలోకమున కేగినప్పుడైన,
రొకరనొకరు బాయ కుండినాము
అమ్మను జెఱవట్టి యతఁడు బాధింపంగఁ,
గనలారనొకటియై కాంచినాము
గీ. తుదకు వధియింపుఁడనుచునా దుష్టుఁడనుప
భటునికృపచేత నిక్కాన బ్రతుకఁదలఁచి
వచ్చితిమి నేటికెడఁబాయ వలసివచ్చెఁ
గటకటా సోదరీయెందుఁ గాంతునిన్ను.

(ముందునకునడచిచూచి) అయ్యో ఏ మిది దేవదానవులమృతము మథించునెడ సాగరంబునఁబుట్టిన బడబానలంబుఁబోలె నరణ్యంబు నెల్లగాల్చుచుదవానలంబు నాకెదురుగ వచ్చుచున్నది. హాకాళికా! నన్నీ మంటలోఁగలిపి బూడిద చేయఁదలఁచితివా? ఇఁక నాకుఁదెర వేది-నన్ను రక్షించువారెవరు.

చ. జనకుని చాపువింటి పెలుచన్ దురితాత్ముని బారిఁజిక్కి హా
యనివిలపించు నాజనని యంగదకోర్చితిఁ దోడునీడయై
యనయము నాకుదిక్కయిన యట్టిమదగ్రజుఁ గోలుపోతిని
తనువిఁకఁదాల్చియేమి సుకృతంబగు కార్యము నేయనేర్తునో.

(ముక్కుపై వ్రేలిడుకొని) ఔరా వీరసేనమహారాజుగారి వంశ మింతటితో నంతరించును గాఁబోలు. విధికృతమునకు వేఱు జరుగదు గదా. యిట్టి యిక్కట్టులఁ జెంది యొంటికత్తెవలె బ్రతికి నేనే రాజ్య మేలఁగలను. ఛీ యీపాడుబ్రతుకుకన్నఁ జచ్చుటయే మేలు- (దవానలమునకెదురై) ఓ సర్వపావనా! స్వాహావల్లభా! ఈ నిర్భాగ్యుఁడగు కనకశేఖరుని నీయందు లీనముజేసి పుణ్యము కట్టుకొనుము.

తే. సతముతావక భజనాభి రతిఁజరించు
వారలకుసౌఖ్య మొసఁగి రంభారతంబు
నొసఁగువాఁడవునీవు నన్నుచితరీతి
సరగనాకంబుఁజేర్పుమో జాతవేద!

(అని యగ్నిలోఁబడఁబోవును) తెరలో.

తే. వ్యర్థముగనేల నీతనుత్యాగమునకు
సాహసించెదు వలవదు సకలశుభము

లమరు శాంతింపుమయ్య కష్టములెశాశ్రీ
తములుగాఁగలవే ధరా తలమునందు.

కన:— (ఆలకించి ఆశ్చర్యముతో) ఈపవిత్ర మూర్తియగు హవ్యవాహనున కాహుతిగానున్న నన్నువరా వారించువారు (నిదానించి) ఈపలుకు లిట్టి నిర్జనారణ్యంబున వెలువడఁ గారణమేమి. (ఆకసమువంకఁ జూచి) భగవతియగు నశరీరవాణి గాఁబోలు వారించుచున్నది. ఇట్టి దురంతచింతా సాగరంబునఁ గొట్టుకొనిపోవు నాకెట్టి శుభము గలుగఁగలదు. తండ్రియా దుష్టబుద్ధివలన దేహంబువాసెను. తల్లి యా గొప్ప విపత్తున మునిఁగెను. భగినియా! యిక్కాన నేమృగము వాతనోపడి మరణించి యుండనోపు రాజ్యమా శత్రువుల పాలయ్యె నింకెక్కడి సుఖము, ఎక్కడి బ్రతుకు. ఇదియంతయు నట్టిమాటయే అయినచో భగవతివచనంబు లసత్యములా. అయ్యో సందిగ్ధావస్థగలిగెనే ఏమిచేయుదును. చేయునదేమున్నది. అన్నిటిని సహించి యుండుటయే ఇప్పటికీ దవానలము చల్లారినది. నాసామర్థ్యము కొలఁది వెతకి చూచెదఁ గాక.

(అని నిష్క్రమించును)

తృతీయాంకము

సమాప్తము,



శ్రీ

మీనాక్ష్యై నమః.

# విషాద కనకతారీయము.

## చతుర్థాంకము.

కనకశేఖరుఁడు:— (ప్రవేశించి)

చ. కనుఁగొన నేర్చువారలకుఁ గన్పడుఁ జక్కని రూపుతోడ నెం
దునఁగొలఁగానియజ్ఞులకుఁ దోఁచఁ డొకించుకయున్ గుణాత్ముఁడై
తనరియుఁ దద్విహీనుఁడయి తర్కమునన్ బొడగట్టు నెవ్వఁడా
యనఘుని నిర్వికారుని మహాత్ముని నాత్మ నమస్కరించెదన్

మ. తనకాధ్యాత్మిక విద్యయే సకల తత్త్వజ్ఞానముం గూర్ప నెం
దునకీ సౌఖ్యము లేటికీ తనువు సద్యోజాతమై యుత్తరం
బున నాశంబగుగాదె లోకమనుచున్ మోహంబుఁ జెండాడ నే
మనుజ శ్రేష్ఠుఁడు మామకీన పితయున్మత్కార్యమున్గూర్చెడున్

ఆహా సకలంబు నిశ్చలంబును నిర్మలంబునై కానవచ్చుచున్నది.
గర్హితము కాదనియె తలఁచెదను, సహస్రకిరణంబులకోఁ దమో

భంగముగావించు కర్మసాక్షిని దివాంధము దూరిననేమి భూషించిన నేమి అయినను నడుమ నడుమ నంధకారముతలయెత్తుచునేయున్నది. దాని నష్టములేదు. ఎవ్వండైనను మల్లెకునీ రుబోయును గాని వల్లెరునకుం బోయుంగదా ఇది రాత్రియా పగలా ఏదియునుగాదు. ఇది యొక మాయ. కలగాను గదా ఇది జాగ్రదవస్థయే దుష్టబుద్ధి కతన మా తలిదండ్రు లంతమొందుటయు వేటనూాలమున రుద్రదేవుండడవికిం బోయి యంధకారణంబుగం జచ్చుటయు నొక మహాకార్యోద్ధరణము నకే నే శోకదవానలంబునం బడంబోవు నపుడు భగవతియగు నశరీరవాణి వారించెనుగదా. అంకుల కిపుడీ పౌరులచే నియమింపం బడిన యేనుంగు నామెడలో హారము వేయుటయే ఫలము. దాన గదా. నాకీ పట్టణమంతయు స్వాధీనమగుటయు సంభవించినది. కాని నాకు మనోవ్యథ మాత్రము హెచ్చుచున్నది. ఏలనన తలిదండ్రులు గాన వత్తురను కోరిక యీజన్మమున ఫలించదనుట నిక్కమే. భగిని యైన బ్రతికియున్నదో లేదో పది దిక్కులకు భటులంబంపి వెదకించెద.

తే. ఉచితమగుం బ్రతిక్రియసల్పి యొనరినట్టి
కష్టములందీర్చి కొనవలెం గాకరి త్త
వంతం గుందంగనేల శాశ్వతము లగునె
యరయ సుఖదుఃఖములె వారికైనం గాని.

కావున సత్వరమసోదరి నన్వేషించుటకై యత్నించెదంగాక

(నిష్క్రమించును.)

తార:—(ప్రవేశించి) అయ్యో! దైవమా! ఇంక నాకుదిక్కెవరు కొండలందును గుహలందును వనములందును వెదకితిని మా కనక శేఖరుండెందునను గానంరాడు ఏమిచేయుదును.

మ. అకటా దాహము దాహమంచవుడు నేనారీతి మూర్ఛిల్లఁగా
నికటస్థోలికి నీటికై యఱిగి యెంతే కష్టముల్ జెందితో
కటు బంతంబుల నన్ను గానక యదుఃఖంబూని యేరీతి స్రు
క్కుక ప్రాణంబులతోడ నుంటివో యెటుంగన్ రాదుగా తమ్ముఁడా

ఉ. పుట్టిన దాదిగాఁ గలిసి పుణ్యము పాపము చేసినార మె
ప్పట్టున నైనఁగాని యెడఁబాయక యొక్కటిగా మెలంగి నా
పట్టియవస్థలన్ గుడుచు నన్నును గాంచి సహించి నేటికీ
నట్టడవిన్ బురాకృతమునన్ విడిపోయితిమయ్య సోదరా!

ధీవ:—(ప్రవేశించి) ఎవరువారు!

తార:—అయ్యా నేనొక నిర్భాగ్యురాల!

ధీవ:—నీవీ యడవి కేలవచ్చితివి నీతలిదండ్రు లెవరు.

తార:—అయ్యా నాకథయంతయు నొక పురాణమున కన్న పెద్దది కావున నిదానముగఁ జెప్పెద నాకుఁ గొంచెము ప్రసాదముఁ బెట్టి సాప్రాణముల నిలుపుము.

ధీవ:—అమ్మా నావెంటరమ్ము మూగాగ్రమును కొలఁది దూరము ననే కలదు. అందునీకు శుభముచేకూరఁ గలదు.

(ఇరువురు నిష్క్రమింతురు.)

రామసింగు:—(ప్రవేశించి)

చ. చిలుకలు గోరువంకలును జెన్నగుఁ గోయిలలంచపిండులున్
గొలువ వియోగులన్ వెతలఁగుందెడునట్లులు జేయఁగోరియా
మలయసమీరు వెంటఁగొని మక్కువవచ్చుచు నున్నవాఁడు పూ
విలుతుఁడు నేఁడు నాకిటఁ బ్రవేశముకూడదు కష్టమయ్యెడున్.

కావున మరలిపోయెదఁగాక (పోఁబోయి) ఆఁ మరచితిని.

నా ప్రియ తమయగు రాధ నన్నుద్యానవనమున నుండుమని కదా కోరినది పాపమా తరుణికి నాతోఁగూడ నిందలి వసంతశోభ నీక్షింపవలయునని యెంత వేడుకగానున్నదో నేనా యబల ప్రార్థన నేలఁద్రోసి వేయవలయును. నేనొక్కఁడనైనఁ గదా మదనునకు భయ మొందవలయును క్షణములో నా రాధ రానేవచ్చును. ఇఁక సందేహ మొందులకు.

(ఉద్యానవనమునఁ బ్రవేశించి పరిక్రమించిచూచి) చిగిరించిన గున్నమావులును ఫలభార వినమ్రములై యున్నతులగుణము లిట్టివని తెల్పు నీపనసలును మృదువులై మనోహరములగు నీకదళీ తరువులును విశాలములగు నీకొలఁకులదరి యిసుకతిన్నెలును నాజీవితము నానోమువంట నాబంగరుబొమ్మ నారత్నభాండమగు నాముద్దుల రాధను తలంపునకుఁ దెచ్చుచున్నవి. (త్రోవకై వీక్షించి) క్షణములో వత్తుననిగదా నాతోఁ జెప్పినది. ఇంతయాలస్యముఁ జేయుటకుఁ గారణ మేమైయుండును. (అని చూచుచుండును.

రాధ:—(విచారముతోఁ బ్రవేశించును)

రామ:—(చూచి) నాజీవితమా! వచ్చితివా రమ్ము. (అని కౌఁగిలించుకొని) సఖీ యింతయాలస్యమున కీదాసుఁడోర్వఁగలఁడా.

రాధ:—(పలుకకుండును.)

రామ:—(రాధముఖమెత్తి) కాంతా పలుకవేమి నీకు విచారమేల.

గీ. శరదమలచంద్ర బింబంబు సరణినలరు
నీముఖంబది యేలొకో నీరజాక్షి
మంచులోనున్న పద్మంబు మాడ్కిఁ జెన్ను
దొలఁగియున్నది వాకొని దెలుపవలయు.

రాధ:—(కన్నీళ్ళు విడుచుచు) నాథా! యేమని చెప్పుదును.

రామ:—తరుణీ! నాయుండనుండిన నీకుఁ గొఱంతయేమి.

రాధ:—ప్రతీకారశూన్యమగు నా పరాభవము మీకుఁ దెలిసినమాత్రు కేమిఫలము.

రామ:—ఫలములేకేమి చెప్పుము.

రాధ:—(తనలో నాలోచించుకొని) ఈపన్నుగడబన్నెదను. (ప్రకాశముగా) మీతోఁగలసి యీనూతన వసంతశోభ నీక్షింపవలయునని వేడుకపడి మిమ్మిటకంపి యీనుక్షణమే వచ్చుటకై యలంకరించుకొనుచుండ మృత్యుదేవతవలె మాయింటనున్న దాసి నన్ను గాంచినది.

రామ:—ఆదాసి చూచిననేమి. దానివలన భయము శంకింప నవసరములేదే. అది యిట్టి విషయములలోఁ బనిగల్గించుకొనదు. నేనెఱుఁగుదును

రాధ:—అయ్యో మీరు దానిని గౌరవింతురేల. ఆదుష్టదాసివలననే యింతమూడినది.

రామ:—(కోపముతో) ఆ నిన్నేమయిన నాటంకముచేసెగా.

రాధ:—అట్లయిన బాగుగనే యుండును.

రామ:—అట్లుగాక మఱేమిచేసెను.

రాధ:—అప్పుడే యన్యగ్రామమునుండి వచ్చుచున్న నాపతి కెదురేఁగి మన రహస్యమంతయు బూసగ్రుచ్చినట్లు చెప్పినది.

రామ:—ఏమీ యింతపని జేసినదిగా (కోపముతో) ఇప్పుడేపోయి యాదుష్టదాసిని సంహరించి వచ్చెద. (అని పోఁబోవును.)

రాధ:— (చేయిఁబట్టుకొని) మనోహరా తీవ్రపడకుఁడు జరిగిన కథనెల్ల వినుఁడు.

రామ:—తరువాత.

రాధ:—నన్ను మ్రింగునంతటి రోషము గల్గినను లోలోన నణఁచుకొని నన్నొక యంధకార బంధురమైన గృహములో బంధించినాఁడు.

రామ:—అబ్బా నీపాపిష్టురాలివలన నెంతకష్టమొందితివి.

రాధ:—నేనప్పుడందలి గవాక్షమును బగులఁగొట్టుకొని యెవ్వరికంట బడకుండ ప్రాణములఁజేతఁ బట్టుకొని వచ్చితిని

రామ:— (విచారముతో) సరే ప్రస్తుతము చేయఁదగిన కార్యమేమి?

రాధ:—మీకు దెలియదా.

రామ:—అట్లుగాదు చెప్పుము ప్రియా (అని వెన్నుజరచును.)

రాధ:—క్షణక్షణమునకుఁ జెప్పుచుండవలయునా.

రామ:—నీపలుకులు నాకు స్పష్టముగాఁ దెలియుటలేదు. చెప్పుము.

రాధ:—ఆనాటి సాయంత్రనమునఁ జెప్పినది మఱచితిరా!

రామ:—(స్మృతినభినయించి) జ్ఞప్తికి రాలేదు.

రాధ:—(చెవిలో నేదియో చెప్పును.)

రామ:—తప్పక చేయవలసినదే.

రాధ:—నాకుఁ జేసిన పరాభవమున కదియే ప్రతీకారము.

రామ:—అయిన నీవటిగి నాకై వేచియుండుము.

రాధ:—(నిష్క్రమించును.)

రామ:—(తనలో) అయ్యో యీయాతురణి యెట్టికార్యము నామీఁదఁ బెట్టినది. పాపములకెల్ల భైరవుఁడనైతినే. ఇదివఱకెన్నియో

సార్లు నాకపనిబెట్టు వారించితినిగాని నేటికి తప్పక చేయవలసి వచ్చెను.

చ. తనకుఁ బరోపకారమె సతంబొక కజముగాఁగఁ జేయుచున్
దనరెడివాఁడు దుష్టులు పృథాతను దూరినఁగాని వల్కకన్
జనియెడి శాంతమూర్తి పరుషంబులఁ బల్కెటుఁగనట్టివాఁ
డనఘుఁడు భీమదాసెటుల నాతని, జంపఁగనేర్తు రాధకై

ఆహా ఈదృశ్య ప్రపంచమునందు.

చ. కలుషమెయౌనుగాక ♦ జనకంటకమయ్యెడుగాక దల్లిదం
డ్రులు తలవంపునగ ♦ దన పరోక్షమునందెచరింత్రుగాక ని
చ్చలు తమ భర్తనేలియును ♦ జంపుటకున్వెను దీయరాత్మలో
వలచిభుజంగులగ గలసివర్తిలు ♦ కాంతలు పెక్కుభంగులగ.

ఎట్లయిన నేను తప్పక జేయవలసివచ్చునప్పుడీయనర్థక విచారము లెందుకు. ఇది లోకవిరుద్ధముగాదుగదా.

చ. కులమునకప్రతిష్టరయెనఁగూడిన ♦ గాని తదీయబాంధవుల్
చులకనజేసియూతనిని ♦ జూచినఁగానినృపాలుఁడాత్మలో
నలఁగినఁగానిమారుని సితాంబక ♦ పాలికి జిక్కుసుక్కితాఁ
గలసినపూవుబోడియెడ ♦ గౌరవముండకపోదెవ్వానికిగ.

కావున నవశ్యము రాధకైనా నియోగ మును నెరవేర్చవలసినదే (అని నిష్క్రమించును)

4 వ రంగము. అంతఃపురవనసమీపము.

భీమదాసు:—(ప్రవేశించి) పాపమూ సాధ్వీమణి మాయింట ప్రవేశించినది మొదలు నాయందు బితృభావమున నాయానజవ వాటక ప్రవర్తించుచున్నది. నేనును నా కొమరుని విశేషముగ దయ

గలిగియేయున్నాను. కాని నాభార్యమాత్రమీదాసి మన యింటనుండక, గడ్డుకాలము గదా. రాఁజడితగ్గినప్పుడితరు లభరించుట కష్టతరమని నాకప్పుడప్పుడు బోధించుటయేగాక నాదీనురాలియెడఁ గసరుకొనుచున్నట్లుగూడఁ దెలియుచున్నది.

తనబిడ్డనెత్తి పెంచుచుఁ దన కన్నివిధములఁ బనిపాటలందు సాయమగు నాకొను వెడఁగొట్టుమానుటకునుఁ గోపించుటకును గొప్ప కారణ మేదియో యుండవలయును, కాని నాకుమాత్రము దెలియుట లేదు. ఏది యెట్లున్నను నాప్రాణముండువఱకు నీ కేవిధమైన యప చారము చేయక రక్షించెదనని గదా యామె నరణ్యమునుండి తెచ్చి తిని. అట్టి దిక్కులేనిదానిని జంచల బుద్ధిగల రాజ్ఞికై విడచుట ధర్మమా. సాటివారు నగరా. మాతాత తండ్రులనాటినుండి వచ్చు చున్న కీర్తికిఁ గళంకము గలుగదా.

చ. తనధనమెల్లఁ గోల్పడిన దారసుతాదులసహ్యమొందినన్
దనువు కృశించినన్ హితులు తప్పని దూరినరాజు కోపగిం
చినను మఱేమియైన తనుజేరి యనాథులమంచు వేఁడువా
రిని యభయం బొసంగియు ధరిత్రి వృథా విడనాడుటొప్పునే.

అందువలన నాతపస్వినిని విడక మునుపటికన్న దయతో మాతృభావమున రక్షించెదను. (కొంచె మూరకొని) నేఁడేలనో విశేషము రాత్రి కాకపూర్వమే కనులు గ్రుచ్చుకొని పోవుచున్నవి. కావున నంతర్భవనమున కఱిగి శయనించెదను. (అనినిష్క్రమించును.)

5 వ రంగము న్యాయస్థానము.

(అంతట కనకశేఖరుఁడు, మతిమంతుఁడు, శోధనకుఁడు, ప్రాశ్నికుఁడు, దాసి రాధ సేవకుఁడు యాకూబు ప్రవేశింతురు.)

కనక:— అమాత్యా! ఆలస్యమేల నేరమును విచారించుటకుఁ బ్రయ త్నింతము

మతి:— చిత్తము మహారాజుగారియాజ్ఞ (అని ప్రాశ్నికుని జూచును)

ప్రాశ్ని:— (రాధనుజూచి) అమ్మా నీవీ బోనులోని కెక్కి నేనడుగు ప్రశ్నములకు యథార్థములగు నుత్తర మొసఁగుము.

రాధ:— అయ్యో దైవమా! కలనేనియు బరపురుషులతో మాటాడి యెఱుఁగనే అట్టి నాకీదాసిమూలమున పతివియోగము గల్గుట గాక మహారాజుగారి యెదుర లజ్జవిడచి మాట్లాడవలసి వచ్చెనుగదా. (అని యేడ్చును)

ప్రాశ్ని:— ఏడ్చిన లాభమేమి నేనడిగినదానికెల్ల నదుత్తర మొసంగ వలసినదే.

రాధ:— (బోనులోని కెక్కును.)

ప్రాశ్ని:— దేవుని యెదుట ప్రమాణముజేసి నిజము చెప్పెదను అబ ద్ధము చెప్పను.

రాధ:— (ఏడ్చుచు) నాయనా! ఎల్లప్పుడును నాకు రెండవప్రాణమైనా మేలుగోరు భర్తను గోల్పోయి పుట్టెడు దుఃఖములోనుండియు నిజము చెప్పక యబద్ధమే చెప్పెదునా అబద్ధమాడి యింక నేనుసుఖమును బొందఁబోదును తండ్రీ!

ప్రాశ్ని:— నేజెప్పినట్లు కంఠమెత్తి చెప్పుము.

రాధ:— దేవుని యెదుట ప్రమాణముజేసి నిజము చెప్పెదను. అబద్ధము చెప్పను.

ప్రాశ్ని:— మీకులమేది?

రాధ:— శెట్టికులము.

ప్రాశ్ని:—నీపేరు.

రాధ:—రాధాబాయి.

ప్రాశ్ని:—నీభర్తపేరేమి?

రాధ:—(స్వగతము) అయ్యో నాపెండ్లివాడుకూడా అత్తాఅండుబిడ్డలు తోడికోడండ్రు ఎంతో అచ్చట ముచ్చటగా ఆయనపేరడిగితే చెప్పటానికి సిగ్గంటే యిప్పుడింతమందిలో సిగ్గువిడచి యెట్లా చెప్పేది. (అనియూరకుండును.)

ప్రాశ్ని:—చెప్పవలసినదే మౌనముం బూనిన సాగదు.

రాధ:—(మెల్లగా) భీమదాసుగారు

ప్రాశ్ని:—వయస్సు.

రాధ:—అయ్యోతండ్రీ యెన్నోయేండ్లు వచ్చిందాకానా చిన్నతనం లోనే నాకాపురం చిచ్చుబెట్టిపోయినారు.

ప్రాశ్ని:—నీభర్త వయస్సుగాదు. నీవయస్సు.

రాధ:—నాకుమట్టుకేండ్లెక్కడివి నాయనా. పోయిన బందరుప్పెనకు యిరువైయారో మీదరెండో అని మావారు చెప్పుచుండే వారు. యిప్పటికి దాసిమూలాన నీరాత రాసిందిగాని.

ప్రాశ్ని:—మీకు జీవనమేమి.

రాధ:—ఇప్పటివఱకు వారే తెక్కల కష్టముమీంద యింతో యంతో తెస్తుంటే జరుగుచున్నది. ఇంకమీంద నాబ్రతుకెట్లు తెల్లవారునో తెలియదు.

కనక:—(వాపోయును)

ప్రాశ్ని:—(దాసిని జూచి) ఈమె కులగోత్రములు నీకేమైనం దెలియునా.

రాధ:—తెలియదు.

ప్రాశ్ని:—నీవడుగలేదా. అడిగినను దాసి చెప్పలేదా.

రాధ:—ఎప్పుడైన నడిగినచో దుఃఖించుచుండెడిది. అందులకు మా వారు నన్ను నివారించుచుండువారు.

ప్రాశ్ని:—ఈమె మీయింటికెట్లుచేరినది.

రాధ:—ఒకనాఁడు నాభర్త వేఁటకై పోయి యడవిలో దిక్కులేక పడియుండ జాలిచేత మాయింటఁ బనియైనఁ జేయుచుండునని తలఁచి తీసుకవచ్చినాఁడు.

ప్రాశ్ని:—నీభర్త వేఁటయు జేయుటకలదా.

రాధ:—పనితీరిక గల్గినప్పుడెల్ల వేటకై పోవుచుండువారు.

ప్రాశ్ని:—ఇంకా నీ భర్త యే యే పని చేయును.

రాధ:—మావారికి వేఱు పనులేమి లేవు

ప్రాశ్ని:—మీయింటియందు వేఁటసామగ్రి సంపూర్ణముగఁ గలదా.

రాధ:—ఆ సమగ్రముగనె యున్నది.

ప్రాశ్ని:—కత్తులు కటార్లుకూడా కలవా?

రాధ:—వానితో మావారి కవసరములేదు.

ప్రాశ్ని:—ఈదాసి మీరుచెప్పిన పనిపాటలు బాగుగఁజేయుచుండునా?

రాధ:—వచ్చిన కొన్నిరోజుల వఱకుఁ జేయుచును యుండెడిది.

ప్రాశ్ని:—కొన్నిరోజులనఁగా నెన్నిరోజులు.

రాధ:—మాయింట జేరిన నెలరోజుల వఱకు.

ప్రాశ్ని:—తరువాత మీరు చెప్పినమాట వినకేమి చేయుచుండెడిది ?

రాధ;—ఇరుగుపొరుగువారితోఁ బరిచయముచేసికొని ప్రొద్దుగడుపుచుండెడిది.

ప్రాశ్ని:—ఈదాసియందు నీభర్తదయతో నుండునా యథోచితముగా!

రాధ:— వారిమాట విన్నంతవరకును దయగానే యున్నారు. తరువాత మాత్రము చూచి చూడనట్లుండెడివారు.

ప్రాశ్ని:—ఎప్పుడైన కోపముచేసియుండునా యీమెను నీభర్త.

రాధ:— ఒకటి రెండుసార్లు పొరుగిండ్లకుఁ బోవలదని చీవాట్లు పెట్టిరి గాని దాసి వినలేదు.

కన:—(వ్రాయును.)

ప్రాశ్ని:— ఈ దాసికి నీభర్త యెడలఁగాని నీయెడలఁగాని యేవిధమైన గాని కోపమున్నట్లు నీకుఁ దెలియునా?

రాధ:—కొన్ని దినములనుండి నాభర్తనుగాని నన్నుగాని జూచినవు డెల్ల పెడమొగము పెట్టి లోలోన నేదియో గొణఁగికొను చుండెడిది.

ప్రాశ్ని:—అందులకు గారణమేమియో నీవు చెప్పఁగలవా?

రాధ:—ఏలచెప్పలేను. ఇరుగు పొరుగునయున్న మావిరోధుల దుర్బోధలే దాసికోపమునకుఁ గారణము.

ప్రాశ్ని:—ఈవిషయమై నీవుగాని నీభర్తగాని శోక్యము గలిగించు కొంటిరా?

రాధ:—నా భర్త నిన్నటి యుదయమున నీదాసిని మాయింటనుండ వలదని చెప్పిరి.

ప్రాశ్ని:—దానికి దాసి యేమిచెప్పినది?

రాధ:— మాట్లాడలేదు.

ప్రాశ్ని:—గడచిన రాత్రి నీవింట నుంటివా?

రాధ:—ఇంటిలోనే యుంటిని.

ప్రాశ్ని:—ఈదాసి కూడయున్నదిగదా.
రాధ:—లేదు.
ప్రాశ్ని:—లేకెక్కడికి పోయినది.
రాధ:—తెలియదు.
ప్రాశ్ని:—ఈదాసి రాత్రింతలఁగూడా నెక్కడికైనఁ బోవుటకలదా.
రాధ:—ఒకరాత్రియు నొకపగలనియులేదు. ఆమెయిష్టము వచ్చినట్లు సంచరించుచుండును.
ప్రాశ్ని:—నేరము జరిగినరాత్రి మీయింట నెవరెవరుండిరి.
రాధ:— నాభర్తయు నేనును నాచంటిబిడ్డయు నీదాసియునుంటిమి.
ప్రాశ్ని:—వేఱెవ్వరును లేరా.
రాధ:—లేరు.
ప్రాశ్ని:—ఈదాసి నీమగనిఁ జంపినప్పుడు నీవుదగ్గఱనున్నావా.
రాధ:—నాయనా నేనక్కడనున్న నాభర్తను జంపుచుండ నూరకుందునా.
ప్రాశ్ని: —అయినచో నీదాసియే చంపినదని నీవెట్లు చెప్పఁగలవు.
రాధ:—నేనా రాత్రి యించు మించుగాఁ బదునొకండు గంటలకు నప్పుడు పాతశాలలో సామాను సదిరితి యనంతను గదా యని గర్భగృహములోనికిఁ బోవుచుండనీదాసి నాభర్త పడుకొనియున్న యంతర్భాగము నుండి వచ్చుచు నాకెదురైనది. అప్పుడు నేనీ దాసినిఁజూచి యేమే ఎన్నఁడును లేనిదీ యర్ధరాత్రిమున నొంటరిగ నీ లోపలి కేలవచ్చితివి నిన్నెవ్వరు పిలచిరని యడుగుచు నంతర్భవనములోనికేఁగి చూచువఱకు అయ్యో జీవితేశ్వరా నన్నాధను జేసిపోయితివా. హా నాకు దిక్కెవరు (అనియేడ్చును.)

ప్రాశ్ని:—దుఃఖంపకుము జరిగిన దానికెవరేమి చేయుదురు.

రాధ:—నాభర్త తలతెగి రక్తము ప్రవహించుచున్నది.

ప్రాశ్ని:—ఆయింటి యందప్పుడు మరెవ్వరు లేరా.

రాధ:—(కన్నీళ్ళువిడచుచు) లేరు.

ప్రాశ్ని:—తరువాత నీవేమి చేసితివి.

రాధ:—నేను రొమ్ముబాదుకొనుచు వీధిలోనికిఁ బోయితిని.

ప్రాశ్ని:—అప్పుడు దాసి యేమిచేయుచున్నది.

రాధ:—తన చేతుల కంటిన రక్తము కడిగికొని వీధిలోనికివచ్చి దొంగయేడ్పు యేడువసాగినది.

ప్రాశ్ని:—వీధిలో నెవ్వరైన నుండిరా యప్పుడు.

రాధ:—(యాకూబునుజూపి) ఈసాహేబుగారు మాత్రముండిరి. తర్వాత నిరుగు పొరుగువారు గుమిగూడిరి.

ప్రాశ్ని:—ఇఁకనీవు బోనునుండి దిగుము.

రాధ:—అయ్యా! దిక్కులేనిదానను రక్షింపుఁడు. (అని యేడ్చుచుఁ బోనుదిగును)

కనక:—(ప్రాశ్నికునిజూచి) ఇఁక యాకూబు సాహెబును విచారించుఁడు.

ప్రాశ్ని:—యాకూబ్ నీవు బోనులోనికెక్కి నేనడుగు మాటలకుఁ దెలిసినంతవఱకు నిజము జెప్పుము.

యాకూబ్:—(అందఱికి సలాముజేసి) బోనులోనికెక్కును.

ప్రాశ్ని:—దేవునియెదుట ప్రమాణము జేసి నిజము చెప్పుతానను.

యాకూబ్:—దేవున్కియెమట ప్రమాణముచేసీ నిజము చెప్పుతానూ.

ప్రాశ్ని:—అబద్ధము చెప్పను

యాకూబ్:—అబద్ధం సెప్పనూ.

ప్రాశ్ని:—నీ దేకులం.

యాకూబ్:—సాదీఖులం మునల్మాన్ఖులం.

ప్రాశ్ని:—నీపేరేమి

యాకూబ్:—నాకీపేరూ సయ్యద్ యాకూబ్ సాహెబ్.

ప్రాశ్ని:—నీకు జీవన మేమి.

యాకూబ్:—మేమూ పోలీస్ ఉద్యోగంవళ్ళ జీవనంసేస్తె.

ప్రాశ్ని:—నీకీరాధాబాయి తెలియునా.

యాకూబ్:—దెల్సునూ.

ప్రాశ్ని:—ఎట్లు దెలియును.

యాకూబ్:—బీమదాసుగార్కి భార్యాఘూనుండీ.

ప్రాశ్ని:—నీకీనేరము విషయమై యేమితెలియును. ఎట్లు దెలియును. ఎప్పుడు జరిగినదని తెలియును.

యాకూ:—మహారాజ్ మేమిూకల్ గా రాబజెతక్ ఖాానేసీ షామ్ మే ఘుస్తీ బయల్ దేరీ ఘూంధీచాక్ ఖాడీకి వచ్చేతల్కి (దాసిని జూపి) యీాజారత్ రాతుసీలాగా ధాడ్ సేస్తా మాకీయెదురుగా వచ్చింది. మేమ్ సూసి ఆతుర్యంపోయి కోణ్ హైతుమ్ ఇంత అర్ధరాత్రింఖాడా యెల్లడ్కి ధాడ్ సెస్తావుండావ్ నీకీనూసి దొంగఅని మేమ్ తలుస్తామ్ ఘుస్కి తానాకుచలో అని సెప్పీనాం. అప్డు యీా సైతాన్ దాసి దుఃఖంసెస్తూ మేమూ దొంగకాదు. భీమదాసు ఘుర్మేఁహుండె దాసీవారం డాక్టర్ సాహెబ్ కా ఘుర్ సెదవా తెస్తూ వుండామ్ అని చెప్పింది. అంధ్కు మేమూనిజము తలచి వున్కు చోడీదియా. తర్వాత ఆదా ఘుంటకు భీమదాసుఘుర్ ఖాడ్కిపోయి సూసెతల్కి రాధా

బాయి ధర్మాఖాడా నా మగడ్ మర్గయా అని యేడ్వసాగింది. అప్డు మేమ్ అచ్ఛాఫర్మాలేద్ అని సెప్పి లోఫల్కి పోయి నూసినాం. బీమదాన్ ఖత్తితో ఘాడ్చి సంపినట్లుగా ఫడియుండాడ్.

ప్రాశ్ని:—ఆనేర మెవ్వరు చేసినట్లు నీవు నిశ్చయించితివి.

యాకూ:—తర్వాత వార్ఖీవిర్ఖీ పిల్చి జమాబందీసేసీ ఆకేస్ యీదాసీది చేసినట్లు నిశ్చయించినామ్.

ప్రాశ్ని:—ఎట్లు నిశ్చయించితివి?

యాకూ:—అంతకు మున్పు ఆదఘంటఖాడా మాకీయీదాసీ యెదర్ఖావఢం తర్వాత బీమదాన్ ఘర్మె ఘుందర్ ఘూసం కావటం యీదాసీ దొంగ దొంగ యేమ్పులు చెయ్యటం విసారించి యీకేస్ దీనివళ్ళనే ఝరిగీహాంుదునని తెల్సుకున్నామ్.

ప్రాశ్ని:—ఇంక నీకెవ్వరు సాక్షులు లేరుగా అని రాధనడుగును.

రాధ:—ఎవరైన జూచిన నిట్టి కర్మము నాకుఁ బట్టు నాతండ్రీ.

ప్రాశ్ని:—యాకూబును జూచి నీవింక బోనులోనుండి పోవచ్చును.

యాకూ:—(సలాము జేసి) మహారాజ్ యీకేస్ దాసియే చేసింది నిశ్చయం నిశ్చయం (అని బోనుదిగిపోవును.)

కనక:—(వ్రాయును)

ప్రాశ్ని:—(దాసిని జూచి నీవీబోనులోని కెక్కిన నేనడిగిన దానికుత్తరమొసంగుము.

దాసి:—(తనలో దైవమా యెంతగతి గల్గించితివి అని బోనులో కెక్కును.)

ప్రాశ్ని:—(ప్రమాణముజేయించి) నీదేగ్రామము.

దాసి:—ఇప్పటికిదియే గ్రామము.

ప్రాశ్ని:—నీపేరేమి.

దాసి:—ఇప్పుడు దాసియని పేరు.

ప్రాశ్ని:—నీభర్త పేరు.

దాసి:—అదినన్నడుగుట యనవసరము.

ప్రాశ్ని:—నీవీగ్రామమునం బ్రవేశించి యెంతకాలమైనది.

దాసి:—సుమారొక సంవత్సరము కావచ్చును.

ప్రాశ్ని:—నీవీగ్రామమున బ్రవేశించి యెంతకాలమైనది.

దాసి:—సుమారొకసంవత్సరము కావచ్చును.

ప్రాశ్ని:—ఇంతకాల మెక్కడనుంటివి.

దాసి:—భీమదాసుగారి యింట.

ప్రాశ్ని:—నీవు వారింట నేమిచేయుచుందువు.

దాసి:—పాచిపనివగైరా చేయుచుందును. అప్పుడప్పుడు (రాధను జూపి) ఈయమ్మగారి బిడ్డ నెత్తుకొందును.

ప్రాశ్ని:—భీమదాసైనను రాధాభాయియైనను నిన్ను దేనికైన గోపించుట కలదా.

దాసి:—హరిహరీ. నన్ను కోపించి యెఱుంగరు.

ప్రాశ్ని:—వారిమీఁద నీకుఁగోపము గలిగినదా. ఎప్పుడైన

దాసి:—కూడుగుడ్డ నిచ్చి తమ బిడ్డవలె నన్ను బోషించుచున్నవారిపై నాకుఁ గోపమేలకలుగును.

ప్రాశ్ని:—నీవెప్పుడు నింటనే యుందువా లేకెక్కడకైన బోవుచుండుటయుఁ గలదా.

దాసి:—నాకొకచోటకుఁబోవుటకుఁ బనియేమి. ఎన్నఁడైనను రాధా

భాయి దేనికైనఁ బొరుగిండ్లకు బంపఁదలఁచినను భీమదాసు గారు నివారించుచుండెడివారు.

ప్రాశ్ని:—నీవు గడచినరాత్రి యింటనే యుంటివా.

దాసి:—ఇంటనె యుంటిని

ప్రాశ్ని:—నీవు భీమదాసును చంపినమాట వాస్తవమా.

దాసి:—(భయముతోఁ) అట్టిపాపము నేను జేయఁగలనా.

రాధ:—అయ్యో ! నాభర్త నీమెయె చంపినది (అని యేడ్చును

ప్రాశ్ని:—(రాధనునివారించి దాసినిజూచి) ఇఁక నెవరుజంపిరి.

దాసి:—నాకుఁ దెలియదు. దైవమున కెఱుక.

ప్రాశ్ని:—ఇంటనున్న నీకే తెలియకున్న నెవరికి దెలియఁగలదు. ఆసమయమున నీవింటలేవా.

దాసి:—లేకపోలేదు. నేనుఁబంచపాళిలోఁ నిదురించుచుండ రాధా భాయి యేడ్పు వినఁబడినది. అప్పుడు నేనులికిపడిలేచి యంత ర్భవనమున కఱిగి చూడ రాధాభాయియు (యాకూబును జూపి) నీసాహెబుగారును నఱఁకివేయఁబడిన భీమదాసుగారిని చూచుచుండిరి.

ప్రాశ్ని:—అప్పుడు నీవేమిచేసితివి.

దాసి:—కన్నతండ్రికన్న నెక్కువ దయతోఁ బోషించు భీమదాసు గారి దుర్మరణమునకై దుఃఖించితిని.

ప్రాశ్ని:—ఇఁక నీవీబోనునుండి దిగవచ్చును. (అనికూర్చుండును.)

కనక:—(శోధకునిజూచి) విమర్శకాగ్రేసరా ! వింటిరిగదా. ఈ నిందితురాలి యొక్కయు రాధాభాయియొక్కయు సాక్షియొ క్కయు వాక్యములు. కాన మీరాశక్తిలోలేఁది విమర్శించి సత్యము స్థాపించుఁడు.

శోధన:—(లేచి) మహారాజా! అమాత్యశేఖరా. సభ్యులారా!
కడచినరాత్రి జరిగిననేరమును విమర్శింపంగా రాధాభాయి యొక్కయు యాకూబుయొక్కయు మాటలు పరస్పరమువిరోధములుగ గాని సంబంధములేక కాని యుండకుండుటచేతను లోకములో దేశద్రిమ్మరులకట్టి యకార్యము చేయుటయందు ను సందేహముగాని పాపభీతియుంగాని గలుగకుండుట మనకం దఱకుం దెలిసిన విషయమగుటచేతను అట్టివారి కొకచోస్థావరముగ నుండుటకుం గాలునిలువకుండుటచేతను ఈ దాసి దేశమెల్లం దిరిగితిరిగి యిక్కడ చేరినదగుటచేతను ఏపనికైన గాని రాధాభాయి యొక్కడకైనం బంపదలంచినచో భీమదాసు గారు నివారించుచుండెడివారని దాసిచెప్పిన వాక్యమందు భీమదాసువలన దాసియొక్క స్వైరగతికి భంగము గలుగునని యర్థము స్ఫురించుటచేతను తన స్వేచ్ఛకు భంగము కలుగకుండుటకై నిందితురాలే యీ నేరము నొనర్చి యుండు నని తోంచుచున్నది.

నిర్భాగ్యురాలగు తన కన్నవస్త్రముల నిడి రక్షించు భీమదాసును జంపి పిదప దాసి యేమిచేయునని ప్రశ్నింతురేని యింతపట్టణమున సామాన్యంతగు భీమదాసు వలనగాక వేఱొకవిధమునం దనకు బ్రతుకు దెఱవు గలుగదాయను ధైర్యము దాసికేలలేకుండును ను ప్రశ్నయేసమాధానము కాంగలదు. ఈనేరమును జరుపుటకుగాని జరిగించుటకుగాని యేవిధమగు సాధనమునకుగాని భీమదాసుయొక్క శత్రువుల సహాయముగాని కోరి పోకున్నచో ధైర్యవంతులైన పురుషులకైన భయంబు కలిగించు పదునొకండు గంటల రాత్రివేళ గస్తీ చేయుచున్న యాకూబునకు దాసి నడివీధిలోం గానంబడుటకుం గారణమేమి.

డాక్టరుగారింట నౌషధము గొనివచ్చుచుంటినని చెప్పినదనిగదా యాకూబు చెప్పినది తననెన్నఁడును నిలువెళ్లనీయని భీమదానట్టిరాత్రమున విశేషమూరమున నున్న వైద్యునింటి కంపెననుట యెంతసమంజసమో వారే యూహింపుఁడు.

యాకూబుసాహెబసత్యము బల్కెనందురా. చిరకాలమునుండియు మన కెల్లరకు విశ్వాసపాత్రుఁడైన యీతని కీదిక్కులేనిదానిపై మిథ్యాపవాదము నారోపింప నేమిపుట్టిమునిఁగినది. ఈ నేరమెవరు సల్పిరనిన దైవమునకే తెలియుననిగదా దాసి చెప్పినది. తానున్న యింటనంతటి మహాఘోరము జరుగుట తనకెట్లు తెలియదు. భీమదాసు మరణావస్థయందున్నప్పు డరవకుండునా. ఎంత గాఢనిద్రయందున్నను ప్రాణభీతిచే నరచువాని యేడ్పు వినరాకుండునా. నేరము జరిగిన రాత్రి యింటిలో భీమదాసు రాధాభాయియు దాసియు దప్ప నితరులెవ్వరును లేరని యొప్పికొనిన విషయమేకదా. ఈ మువ్వురలో నేరస్థులెవరు. భీమదానే బలవంతముగ తన శిరచ్ఛేదము గావించుకొనఁడుగదా, ఇక రాధాభాయిచేసియుండుననిగదా యనవలె. అగ్నిసాక్షిగా వివాహముజేసికొని యనుకూలుఁడై కలసి మెలసి యుండు భర్తనట్టి దుర్మార్గురాలైన చేతులారఁజంపునా. కావున భీమదానును దాసియే చంపినదను మాట నిశ్చయము నిర్ధారితము నిష్కళంకము, అనింద్యము. అని కూర్చుండును.

కన:—(తనలో) ఆహా యీనిందితురాలను గాంచినప్పటి నుండియు నాకొకవిధమైన సత్యముతో గూడిన యనురాగము గలుగుచున్నది. ఈమె నాతల్లిగాదుగదా, అయ్యో నాకంతటిభాగ్యమా ఆసాధ్వీమణి యప్పుడే సాగరమునబడి చచ్చి యుండును. దాసిని జూచి ఏమమ్మా యీ నేరము నీవలననే జరిగినట్లు

నిశ్చయించి శిక్ష విధింపఁబోవుచున్నారము. నీకేమైన సాక్షు లుఁగలరా!

దాసి:—ఇట్టి పాపాత్మురాలికి సాక్ష్యముగూడ గలుగునా.

కనక:—ఆ యున ద్దో నీనేరమే నీవు చేసినట్లు లొప్పుకొనుచున్నావా.

దాసి:—(ఊరకుండును విచారమున నధోముఖయగును.)

కనక: (తాను జేసిన సిద్ధాంతమును మంత్రి కొసఁగును.)

మంత్రి:—(లేఖనుగొని) మహాజనులారా! శ్రద్ధాళురై వినుఁడు. ఈనేరమును గాథాభాయియు యాకూబును చెప్పిన మాటలను శోధకుఁడు చక్కఁగా విమర్శించి నిశ్చయించుట చేతను నిందితురాలు తన దోషనివారణమునకై యేవిధమైన సాక్ష్యమునుగాని కారణమునుగాని చూపకుండుట చేతను దాసియే చేసియుండునని తోఁచుచున్నది. కావునఁ దన కష్టసుఖములఁ బాల్గొనుచు దనను రక్షించు భీమకాసున కపకారము చేయుట మాని శిరఃఖండనము గావించిన యీదుష్టురాలికి శాస్త్రసమ్మతముగ వధ్యస్థానమున శిరఃఖండనము గావించునట్లు మహారాజుగారు తీర్మానించిరి (అనిచదివి) సేవకా! ఈదాసిని తలవరులకడకుఁ గొనిపోయి మహారాజుగారి శాసనము నెఱవేర్పుము.

సేవకు:—(చిత్తము అని దాసితో నిష్క్రమించును.)

పేరుసెట్టి:—(రొప్పుచు పరుగునవచ్చి) మహారాజా నమస్కారము.

కనక:—పేరుసెట్టీ! ఏల నీవిట్లు బరుగెత్తి వచ్చితివి కారణమేమి.

పేరుసెట్టి:—దా-సి-కా-దు.

కనక:—ఎందులకింత యాయాస మొందెదవు.

పేరు:— అయ్యా! ఇదిగో (అని యొక రక్తముచేత నగము దడిసిన చేతిగుడ్డ నిచ్చును)

కనక:—(మంత్రికిచ్చి) అమాత్యా! దీనిని విమర్శింపుము.

మతి:—(దానిని బరిశీలించి) సెట్టీ దీని నేమిచేయుమనెదవు.

పేరు:— అయ్యా ఇది రామసింగుగారిది.

మతి:—రామసింగెవరు. ఇది నీకెట్లువచ్చినది.

పేరు:—భీమదాసుగారి దొడ్డివాకిట దొరికినది. రామసింగనఁగా గ్రామపాలకుఁడు.

మతి:—ఇదేమీ ఆశ్చర్యముగానున్నదే. పేరుసెట్టీ దీని నవిస్తరము జెప్పుము.

పేరు:—నేఁడుదయమున నేను వెలుపలకుఁ బోవుచుండనిది భీమదాసుగారి దొడ్డివాకిట దొరకినది. దీనిని పరీశీలింపఁగా రామసింగు అని యుంటచేతను మఱియును సగము నెత్తుటిలోఁ దడసి యుంటచేతను కడచిన రాత్రి నేను పొరుగూరునుండి వచ్చుచు భీమదాసుగారి దొడ్డివాకిలి సమీపమున రామసింగుం జూచి యెందులకీ రాత్రియందుంటివని యడుగ నతఁడు భయముతోఁగూడిన కోపముతో నావిషయము నీకేల నేనీనాఁడిక్కడ గానవచ్చితినని యెవరితోడనైనఁ జెప్పితివో నీశిర మీ ఖడ్గమునకెఱజేతునని తన చేతనున్న భయంకరమగు కరవాలము జూపి నన్ను బెదరించుటచేతను తమ స్వేచ్ఛకు విఘ్నకారియగు భీమదాసుగారిని బాధరామసింగుచే జంపించియుండనోవుననియు ఉమావతియగు దాసినినిందించుట దోషమనియు నేలినవారితో మనవిచేయుకొనుటకు వచ్చుచుండఁ జూచి రామ

సింగు నన్ని విచారణ సమయమున నిక్కడకు రాకుండునట్లు జేయనెంచి యేదో పనిగల్గినట్లు నిల్పి కదలనీయఁ డయ్యె. కొంతవడికు పొరుగూరున కేగవలయునని నమ్మించి యీ సాధ్వి కేయపకారము జరుగునోయను భయమునఁ బరుగెత్తి వచ్చితిని. అయ్యారక్షింపుడు పాపమా దాసినిందితురాలుగాదు.

మతి:—అవును కావచ్చును. ఈగుడ్డమీఁద నొకవైపున రామసింగు అని వ్రాయఁబడియున్నది. (అని యందఱి యక్షరములఁ జూపును. అందఱు నాశ్చర్య మొందుదురు)

కన:—(కోపముతో) ఛీ దుర్భాగురాలా! రాధా! మమ్మెంత మోసము జేసితివి. నీమూలమున దిక్కులేని దాసికి శిరఃఖండనము విధించితిమి. (సేవకుని జూచి) ఓరీ నీవుశలవరులకడకేఁ రాధను గొనిపోయి దాసికి విధించినశిక్ష యీ రాక్షసికి మార్పఁబడినదని నాయాజ్ఞ నెఱిగింపుము ఆలస్యము చేయకుము. (సేవకుఁడు నిష్క్రమించును)

కన:—మంత్రిపుంగవా చూచితివా లోకమునందెట్టి సాహసురాండ్రుగలరో.

మతి:—అవును నిజమే.

కనక:—(స్వగతము) ఆహా! ఆమెయందు మత్తమాంగన లక్షణములు గానవచ్చుటయేగాక గౌరవ సహితముగు నొక విధమైన యనురాగముగూడ గలుగుచున్నది. కావున నామె వృత్తాంతమంతయు దెలిసికొనవలయును. (ప్రకాశముగా) మంత్రీ నేటికీ సభచాలింతము.

మతి:—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.

శ్రీ

మీనాక్ష్యైనమః

# విషాదకనకతారీయము.

## పంచమాంకము.

**కంచుకి:** —(ప్రవేశించి) నేను పుట్టి చాలకాలమైనను స్త్రీలయందింతటి సాహసవతులను గాంచి యెఱుఁగను. నిరంతరము రామసింగు మైత్రియే నిత్యమని దైవోపహతయగు చారుమతీ దేవిపై నిందగల్పించిన యాదుష్టురాలగు రాధ యిప్పుడేమి మూటకట్టుకొనినది. విటుని వలన మగని జంపించి నందులకు ధర్మదేవత తుదకు తనపాలి మృత్యువయ్యెను గదా. అవును కాని విధ్యుక్తముగా వివాహమాడిన భర్తను జంప దోషమనియైన యెంచకుండెను గదా ఇదియు నొక మహాకార్యోద్ధరణమే. ఏమందువా. ఈ రాధమూలమున గదా ప్రచ్ఛన్న వేషంబునం దన పాతివ్రత్యంబు గాపాడుకొనుచున్న చారుమతీదేవి దాసీత్వంబు విడిచి కుమారుని గాంచఁగలిగినది. భీమదాసుగారే జీవించియుండిన తన యింట మహారాజుగారి తల్లి దాసిగా నుండి నందుల కెంత నొచ్చుకొనునో. తనతల్లిని రక్షించినందులకు రాజుగారివలన నెంతపొగడొందునో గదా. ఆపాదు రాధ ధనముకొఱకె యిట్టి ఘోరకృత్యముఁ జేయఁగలిగినది. ఆహా! ధనమెంత సామర్థ్యముగలది! దారిద్ర్యము కూడ నట్టిదియె.

కసనిరూఢ్క్తమైన రత్నాకరుని జేరి
పాయునదులంబోలె పరమునఁగాని.

భీష్ముఁడు:—(ప్రవేశించి) ఎవరక్కడ.

కంచుకి:—ఎవరైన నీకేమి.

భీష్ము:—ఏమి నీ గర్వపు మాటలు నేనెవరో తెలియునా.

కంచుకి:—నీవెవఁడవైన నాకేమి.

భీష్ము:—ఎవఁడీగర్విష్ఠి వీనిస్వరముజూడ నిదివఱకెన్నఁడో విన్నట్లున్నది. మనకంచుకిగాఁబోలు గదా. అవునతఁడే (సమీపించి) (ప్రకాశము) తాతా నీవా! ఇతరు లెవరోగదాయని తలఁచి మాట మిగిలితిని కోపింపకుము. ఎక్కడకో ప్రయాణము చేయుచుంటివి.

కంచుకి:—ఓహోహో భీష్ముఁడా నాయనా ఎక్కడినుండి వచ్చుచుంటివి. ఈనాఁడెవరి మొగము జూచితినోగాని రాయొక తెల్లని రూకయైనఁ రాలేదు.

భీష్ము:—చ. ధనము ధనంబటంచుఁ బరితాపముఁనొందఁగనేల ధాత్రిలో
జననము నొందునెల్లరును శాశ్వతులే క్షణ భంగురంబులౌ
తనువులనమ్మి నీచమగుదాస్యము జేయుట కీర్తియే నృపా
లుని వచనంబులే ధనము లోకమటంచును నమ్మరాదొకో.

కంచుకి:—నీమాటలు బాగుగనే యున్నవి. ఎవఁడో విరాగివోలె చెప్పుచున్నావు. ధనమునకు లొంగనివారెవరు.

భీష్ము:—తే. ఎవఁడు స్వచ్ఛంద వృత్తిచే నిలఁజరించుఁ
నతని జన్మంబె సార్థక మగునుగాని
యాలు బిడ్డల కొఱకు హేయంబులైన
కార్యము లొనర్చువాఁడొక ఘనుఁడె చెప్పుము

తే. ధనపిశాచంబు పట్టి నిన్ననయ మిట్లు
బాధపెట్టెడు నేమని పలుకనేతుఁ
బ్రతికియుండిన రెన్నాళ్ళు ప్రాజ్ఞులైన
వారలకు స్వేచ్ఛయొకటి గావలయుఁగాదె.

కంచుకి:— (స్వగతము) ఓహో యీ యువకుఁడు కలహములోనికి దింపఁజూచుచున్నాఁడు. ఈ ప్రసంగము మరలించెదగాక (ప్రకాశముగా) అబ్బాయీ యీ మాటలెప్పుడునున్నవియో కాని విశేషము లేమియో యెఱుఁగుదువా ?

భీష్మ:—విశేషము లేమున్నవి. భీమదాసుగారింట నున్నదాసి మహారాజుగారి తల్లియగుట తెలిసినవిషయమే కదా, తమకుఁ జాల కష్టదశగల్పించినందులకుఁ గోపించి కనకశేఖరమహారాజుగారు దుష్టబుద్ధితో యుద్ధముచేయుచున్నారని మనవీధిలో కింవదంతి గలిగినది.

కంచు:—అదియా భటులకల్లోలము మనము వెళ్లినవవసరము లేదుగదా,

భీష్మ:— అంతఃపురపాలకులకు యుద్ధముతోఁబనియేమి !

(తెఱలో) ఓరీ! కులనాశకా, దుర్మదాంధా, చతుర్దశభువన ప్రథిత రాజవంశ పాదోధిహాలాహలమా

శా. అధీమంతుఁ బ్రతాపుఁ దస్కరుఁడవై ♦ యంతంబుగావించి భూ
నాథుఁ నిద్దురలోపలఁ గెడపి కాం ♦ తఁ బేదరఁ జట్టి చీ
చీ ధైర్యంబుగలాఁడువోలె జయుల ♦ త్క్సంగమోదోగ్రివై
క్రోధావేశుఁడనైన నాయెదుర నీ ♦ కుండనిల్వంగ శక్యమే.

కంచు:—(ఆలకించి) ఏమిదీ! సకల భూమీశ్వర మకుట మాణిక్య విరాజిత పాదకమలుండగు వీరసేన మహారాజుగారి కుమారుఁడు

కనకశేఖరమహారాజుగారి గంభీరోక్తు లున్నట్లున్నవే. ఆహా! పులకలువుడు జలిచీమ పుట్టదను మాట నిజమని నాకిప్పుడు తోఁచినది (విచారముతో) ఆమహారాజేయున్న నేనిట్టి హీన దశననుభవించుచు జన్మస్థానమును వీడవలసిన పనియుండక పోవు నుగదా? దుర్మార్గుఁడగు దుష్టబుద్ధి యమరాలయాతిథేయి యగుఁగాక లోకదూషణము నా కన్యమగా.

భీష్మ:—తాతా! ఈ కనినేనుఁగు మీఁదనగాక క్రిందనుండవలెఁబోలు. దుష్టబుద్ధి యెంత పొంగినట్టిలెమ్ము

కంచుకి:—అవునుగాని పరస్పరము జయాభిలాషచే దేశములమీఁద నేసి యభిమానము లేక ప్రాణ[ములు] కను జేసికొను వారి కోల లదృష్టహీనులవగు మనమీఁదబడియు నా చావవలసిన దే పోవు దము పదము.

భీష్మ:—తాతా! ఇంతవయోవృద్ధుఁడవు నీకుఁ గూడ జావనభయ మేమగునా? ఎన్నాళ్లకైనను మరణము తప్పునా! అట్టిచో నీకింత దేహాభిమాన మేల!

కంచు:—నీకట్టి వైరాగ్యమున్న నాతోఁగలసి యుద్ధము జేతువులెమ్ము! బ్రతికియున్న బలుసుకూరఁదినవచ్చును. (అని నిష్క్రమించును)

భీష్మ:—తాతా! పోకుపోకుము (అని వెంటఁబోవును)

(తరువాత యుద్ధము జేయుచుఁ గనకశేఖర దుష్టబుద్ధులు ప్రవే శింతురు)

కనక:—శా. అన్నీమంతుఁ బ్రతాపు (నను వెనుకటి పద్యము జదువుచు బ్రవేశించును.)

దుష్ట:—ఓరీ! వ్యర్థవాక్యశీలా!

ఉ. వారలవీరలన్ దలచి ♦ వాగెదవేమిటి కాదుదానియు
ట్లారసిమర్త్యయుక్తనిశి ♦ తాస్త్రపరంపరకోర్చినిల్వ నీ
శూరతఁజూపుకొమ్మిపుడె ♦ చూచెదఁగాక భవత్పరాక్రమా
కార రణాంగణంబున జి ♦ తారిని నగ్గలువంగ నేర్తువే.

కన:— ఓరీ దుర్వినీతా! అధర్మమార్గగామీ!

చ. అనుజుఁడవంచుఁ బేర్మి మెయి ♦ నాడినమాటలనెల్లఁ గాచి చూ
డనియటులున్నశాంతమతి ♦ నగ్రజుఁ జంపుటొ పౌరకాంతలన్
గనుగొనిబల్మిబాపమున ♦ గన్ జెరబట్టుటొ కాదుకాదు మ
ద్ఘనభుజశౌర్యవహ్నియది ♦ కాల్చుభవద్భుజకాష్ఠసంతతిన్.

దుష్ట:— ఓరీ ఆత్మశ్లాఘాపరాయణా డింభకా! నిన్ను నీవు చెప్పుకొని యేలపొంగెదవు. హనుమంతుని మ్రోలకుప్పిఁగంతులన్నట్లు నాయొద్దనా నీశౌర్యమును బొగడుకొనియెదవు.

ఉ. బాలుఁడవీవు చూడఁ బదివత్సరములైనను లేనివాఁడ వీ
యాలమునందు నన్నెదురు నంతటివాఁడవె నేఁడుమద్భుజా
భీలశరప్రహారముల వీఁగకనిల్వుమురిత్తపల్కు లిం
కేలవృథాభవజ్జనకుఁ డేగినచోటికి నిన్ను బంపెదన్.

కనక:— ఓయీ వ్యర్థముగఁ గాలయాపన మేలచేయఁ దలఁచెదవు. జయాపజయములు పాక్షికములు గదా. కావున నీకో నాకో జయము గలుగవలయును రమ్ము. ఇది కాచుకొనుము.
(అని కత్తి విసరును.)

దుష్ట:— (తప్పించుకొని) ఓరీ పౌరుషశూన్యా! నీప్రతాపమింతటితోఁ దీరెనా. మరేమైనఁ గలదా. విశాలోరస్కుండనగు నాకుఁ దాకి నీతుప్పుబట్టిన కత్తి యెట్లు ముక్కలైపడినదో చూడుము
(అని కత్తినెత్తిచూపును.)

కనక:—ఓరీ వ్యర్థప్రలాపీ! ఏమని రా! ప్రేలెదవు. అలక్ష్యంబుగఁ బ్రయోగించిన నాశరవాలమును దప్పించుకొంటినని నీకునంతో షమేఁ.

ఆ. రుద్రుఁడొండె వీరభద్రుఁడొండె మదీయ
శితశరాళికోర్వ జతురుఁడెవఁడు
కాచుకొనుము నీకుఁ గాలంబుచేరువ
యయ్యె నే మెయిట దురాత్మనీవు

(అని వేఱొకకత్తిని విసరఁబోవును.)

దుష్ట:—(తనలో) ఇతఁడు బాలుఁడయ్యుఁ బ్రయోగోప సంహారము లందుఁ బెద్దయై వర్తించుచున్నాఁడు. ఇప్పటికి నాకే యప జయము గలుగుచున్నది. ఇప్పుడీతఁడు బ్రయోగింపఁ బూను కొనిన దజేయంబగు నస్త్రము దానికి నేనుగూడ నాహుతి గాక తప్పదు. కావున నామాయోపాయంబున నీవి యస్త్ర ముపసంహరింపఁ జేసితి నాతరువాత తిప్పలాలోచించుకొనవ చ్చును. (ప్రకాశముగా) ఓరీ! అనాత్మజ్ఞా! నీవు బాలుఁ డవు. శత్రుప్రయుక్తములగు నస్త్రముల నుపసంహరించు టయు గురిదప్పక వైరిపైఁ బ్రయోగించుటయు నించుకేనిఁ దెలియని వాఁడవు. అట్టినీతోడ నస్త్రయుద్ధము జేయుట సమం జసముగాదు. శూరులు నిందింతురు. నీకేమైన ముష్టియుద్ధం బునఁ బరిచయమున్న నన్నుఁ జూర్కొనుము. చిరకాలము నకు యుద్ధము గలిగెఁగదాయని యూహ్వింగుచున్న నా భుజ ముల కండూయనము బోవునట్లు నిన్ను వధించెదను.

కనక:—ఏమీ. అస్త్రప్రయోగము నీవెఱింగినంత నేనెఱుఁగనని తల చితివా. వ్యర్థముగ వాగక పౌరుషము గలదేని నన్ను

మోహారింపు లేదేని గాలికి బుద్ధిచెప్పి యెందైన బ్రతుకుము.
ఇదేమైన యుద్ధమనుకొంటివా. నిద్రితులఁ జంపు టనుకొం
టివా. (అని కత్తిద్రిప్పుకొనుచు బైకురుకును.)

దుష్ట:—ఆగుమాగుము (అని చేయిపట్టి) నీవలెనేను మాత్రము కత్తి
త్రిప్పలేననుకొంటివా. అర్భకుఁడవు గదాయని యుపేక్షాభా
వముతోనుంటిని గాని లేకున్న నీపాటికి నీ యయ్యకడకుఁ
బంపివేయుందును. ఇప్పటికి మాత్రము మించినదేమి. కాని
నేనొకమాట జెప్పెదను వినెదవా చెడెదవా.

కనక:—ఏమని చెప్పెదవు. (అని దరహాసము సల్పును.)

దుష్ట:—మన యిరువురకతన నిప్పటికెంతయో సైన్యము మాపుమా
సినది. మఱియు మిగిలిన సైన్యముగూడ నశించినది యెవరికిని
జయము కలుగదుగదా.

కనక:—అవును నిజమే. అయిన నన్నేమందువు.

దుష్ట:—అందువలన సంధి జేసికొందము. ఇది సర్వశ్రేయము.
అనింద్యము. సకల సమ్మతము.

కనక:—ఇదియా నీవు చెప్పుమాట.

మ. అనిలోనిల్వగ నేర్పుజాలమి ననూర్త్యంపశ్యతా కాంక్షల
ట్లనివార్యంబగు మచ్ఛరప్రకరమార్తాండోద్ధతిన్ భీతిచే
తనువే శాశ్వతమంచులోఁ దలఁచి తూత్రంబింతయున్ లేక సం
ధినొనర్పన్ గమకించినాఁడవె యిసీ ధీరోత్తముల్ మెత్తురే.

గీ. పౌరుషము శౌర్యమును నరపాలకులకు
ముఖ్యములువాని విడిచి యెప్పుడును రాజ
మాత్రునకుఁ జరింపగరాదు మహీనతందు
పశువుపోలె గణింపగఁ బడుచు గాదె.

కావున మన కరణమధ్యమున సంధి జేయుట తగదు. ఏది యె
ట్లైనను రణము జేసి జయమో యపజయమో గాంచవలసినదే.

గీ. జయముగాంచుదువేని రాజ్యమున కెల్ల
స్వామి వగుదువు లేకనజయ మొగన్న
స్వర్గ కాంతలతో గూడి సౌఖ్యములను
జెందుదువు సంధి పైయాన నొందనేల.

దుష్ట:—ఓరీ దుర్విణీతా ! నీమేలుగోరి చెప్పినందులకా నన్ను దూల
నాడుచున్నావు, అట్లైన నాలసింపక రమ్ము. స్వర్గకాంతల
కడ కనిపి సుఖంబు గూర్చెద.

కన:—దురాత్మా ! రమ్ము. నీముష్టి యుద్ధమందలి చాతుర్య మెఱుం
గెద. (అని చేయిబట్టుకొని యీడ్చుకొని పోవును.)
(అంతట భీష్ముడును చారుమతియుం బ్రవేశింతురు.)

చారు:—అయ్యో ! చిరకాలమునకుం గనుబడిన నాపుత్రుని దనివి దీరం
జూచుకొనకుండ నీపాడు యుద్ధ మొకటి సంభవించెనే నాయి
యగు దుష్టునివలన నేమి యుపకారము గల్గునో కదా.

భీష్మ:—అమ్మా ! యుద్ధభూమిని సమీపించితిమి. ఇంచుక సహిం
పుము. (తెరలో.)

శా. ఓరీ ! నిల్వుము పారిపోవకు రణోద్యోగంబు జాలించి యే
వారుఁ నన్నెదిరించి నిన్నిచటను బ్రోవఁ నేర్పరుల్ లేరు వి
స్తారంబై నుతిఁ గాంచినట్టి నృపవంశం బందు జన్మించి నీ
వీరీతిఁ వెనుకంజవేయఁ దగునే హేయంబుగాదే ధరఁ.

భీష్మ:—అమ్మా ! నీవిందుండుము. అచ్చో గనకశేఖర దుష్టబుద్ధ

లకు ఘోరమగు యుద్ధంబు జరుగుచున్నది. అరాతి సంహార
మునకై చిరంజీవికి సాయమగుదును. (అనిపోవును.)

భారు:—

మ. ప్రతిపక్ష ప్రకరం బజేయుఁడగు నేరాజన్యమూర్ధన్యు న
ప్రతిమానంబగు విక్రమస్ఫురణ కెప్పాటన్ దలల్పించి సం
తతముం బ్రొక్కుచు నుందు రా ధరణినేతన్ గూడిసౌఖ్యోన్నతిన్
సతినై యుండుదునేని నా సుతున కాశీతుప్రిందు వధ్యుండగున్

భీష్మ:—ఉ. నీ యభివృద్ధినే యరయునీతి విదుండగు భ్రాతఁజంపియా
హా యని దీనవై వెతల నందెడి సాధ్విని బల్మిఁ బట్టియున్
హేయము నాక యవ్విధొ నరించిన పాపఫలంబునీకుఁ దో
డై యరుదెంచు చున్నయది యాజిని బోరినఁగాని తప్పునే
(అని దుష్టబుద్ధి కురులఁబట్టి యీడ్చుకొనివచ్చును.)

కనక:— (వెంట (బరుగెత్తివచ్చి)

చ. అని నను మోహరించి విజయంబును జెందఁగలేక నీచుఁడై
చనియెడి దుర్మదాంధుని వెసన్ బరిమార్చెద సజ్జనాళికిన్
ఘనమగు సౌఖ్యసంతతిని గల్గఁగఁ జేసెద నిష్కళంకమై
తనరెడి కీర్తిగాంచెద బుధ ప్రకరంబు నుతించుచుండగన్
(అని దుష్టబుద్ధి శిరము దెగవేయును.)

(తెఱలో) ఓహో మహారాజా! మీతండ్రిగారు స్వర్గ
కాంతా శ్లేషము గావించినది మొదలు కష్టసముద్రమున మునిఁగిన
మమ్ము రక్షింపుము.

భారుమతి:—అదిఏమి. ఎవరో దీనుల మొఱ్ఱవోలె వినవచ్చుచున్నది.

భీష్మ:—ధనగుప్తాదివైశ్యాగ్రేసరులు పరంపరాగతమైన యీసింహాసన మలంకరించి మరల న్యాయబీజంబు నాటుఁడని వేడుచున్నవారు.

కన:—అటులైనచోఁ బోవుదమురండు.

(అందఱునిష్క్రమింతురు.)

(పట్టాభిషేక మందిరము కనకశేఖరుఁడు భీష్ముఁడు కంచుకి పౌరులు ప్రవేశింతురు.)

భీష్మ:—వీరసేన మహారాజుగారు పరలోకమున కఱిగిననాటనుండియు ననాథయై చింతా సాగర నిమగ్నయగు నీరాజ్యలక్ష్మి నుద్ధరించుటకై యిదె నవరత్న ఖచితమగు సింహాసన మలంకరింపుఁడు. (అని కనకశేఖరునకు సింహాసనముఁ జూపును)

కన:—(కన్నీరు విడచుచు) అకటా యిట్టి మహోత్సవ సమయంబున మాతండ్రియుఁ గోమలాంగియగు నాసోదరియు నుండిన నెంత సంతసింతురో గదా. పూజ్యులగు వారి మూలసింహాసన మెక్కు భాగ్యము లేకపోయెగా.

భీష్మ:—మహారాజా! యిట్టి మంగళప్రదమగు సమయమునఁ జింతింపఁదగునా! విధికృతమునకు వేఱు జరుగఁగలదా విచారమొందకుఁడు.

కన:—(విచారము నభినయించుచు) అయ్యో అకాలమరణము నొందిన మాతండ్రిగారి సింహాసన మధిష్ఠించుటకు నామనసొప్పుట లేదు.

భటుఁడు:—(ప్రవేశించి) మహారాజా! ధీవరమంత్రిగారును తారాదేవియు వచ్చుచున్నవారు.

కన:—(ఆశ్చర్యముతో) ఏమీ! మా యగ్రజయగు తారయా ధీవరమంత్రియా? నిజమా వచ్చుచున్నవారా! బాగు బాగు నాయదృష్టమేమని పలుకవలయును.

(తరువాత తారావళియుధీవరమంత్రియుఁ బ్రవేశింతురు.)

కన:—తారావళిని కౌఁగిలించుకొని

చ. అలసి పిపాస మూర్ఛవడి నట్టినినున్ విడనాడి నీరుద
ర్వ్వలఁగొనివత్తునం చటులఁబోయి యదృష్ట వశంబునన్ ధరా
తలమునకెల్ల రాజనయి తత్పరిపాలనలోనఁ జిక్కినిన్
దలపకయుంటి నన్నిపు డుదారమతిన్ కరుణింపు సోదరీ!

అయ్యో నీవా కారడవిలో నాకొఱకై యెంతవంత గుందితి వోకదా అప్పటి కష్టంబులఁ దలఁచికొనిన నాగుండెలవియుచున్నవి.

తార:—తమ్ముఁడా! నాపూర్వసంచితమునకు నీవేమి చేయఁగలవు.

ధీవర:—కుమారా! ఇట్టి సమయంబున వెనుకటి కష్టములఁ దలఁచి విచారమొందుట భావ్యముగాదు. ముహూర్తము సమీపించుచున్నది. సింహాసన మలంకరింపుము.

కన—అయ్యో నేనే జీవితమని నాకై యెంతయో దపంబు జేసిన జనకుఁ డధర్మమరణమందఁ దచ్చింహాసన మెక్కెక్కఁ గలను. శ్రీరాముని పాదుకల భరతుఁ డభిషేకించినటుల నేనును వీరసేనపాదుల వారి పాదుకల నిందభిషేకించి రాజ్యంబుఁ గావించెద వేఱుగఁ దలఁపకుఁడు.

(తెఱలో) కుమారా! కనకశేఖరా! వలదు వలదు మీ తండ్రిగారు మరణింపలేదు. దుష్టబుద్ధివలనఁ జారాగృహమున బంధింపఁబడి యున్నవారు.

విషాద కనకతారీయము.

కన:— (ఆశ్చర్య సంతోషములతో) ఎవరీ శుభవాక్యముల విని పించువారు.

ధీవర:—కుమారా! భగవతియగు నశరీరవాణినోట వెలువడినవిగాఁ దలంచెద సత్యమేయగును.

భీష్మ:— భగవతి వాక్యము లసత్యము లెట్లగును.

కన:—(వేగిరపాటుతో) మాతండ్రిగారు సజీవులగుట నిజమేకద. పాతాళ భవనమున బంధింపఁబడిరా? (కంచుకిని జూచి) ఓయీ యీవృత్తాంతము మాతల్లిగారి కెఱిఁగించి మాజనకుని వేగముకొనిరమ్ము. (చిత్తము అని నిష్క్రమించి) (వీరసేనమహా రాజుతో మరలఁ బ్రవేశించి) దేవ ఇటుఇటు.

వీర:— (కనకసేనుని కౌగిలించుకొని)

తే. చిన్నతనముననే దుష్ట చిత్తువలనఁ
జెందరానట్టి యిక్కట్లు జెందియకట
దైవయోగంబునన్ నిరంతర సుఖంబు
లందఁగా నేర్చితివి గదవయ్యసుతుఁడ

(అని దుఃఖించును.)

ధీవర:—మహారాజా! శాంతింపుము. (కనక శేఖరుని గాంచి) ఆయు ష్మంతుఁడా! నీవాంఛితము దీరినదిగదా ఇఁక నాలసింపక పితృదత్తమగు శుభాసన మలంకరించుము.

వీర:—(సంతోషముతో కనకశేఖరుని మాసనమున గూర్చుండఁ బెట్టును.)

ధీవర:—కుమారా ఈశ్వరానుగ్రహముచె నెల్లకష్టంబులు గడచి పితరులతోడను భగినితోడను గలిసి సుఖంబుగఁ బట్టాభిషేక

మహోత్సవముగూడ ననుభవించితివి. మఱియు నీయభీష్ట
మేమి?

—అయ్యా! తమ యనుగ్రహమునఁ గలిగిన యీ సంతోష
కార్యమునకన్న వేరుగ నాకుఁ గావలసిన దేమున్నది. అయిన
నిట్లగుఁగాక.

భరతవాక్యము.

పౌరుషవంతులైయవని పాలురు ధర్మము సాధకంబుగా
ధారుణి నేలఁగావుత బుధప్రకరంబు విధిజ్ఞతన్ గులా
చారము వీడకుండుతఁ బ్రశాంతిని జెందుత నీతిబాధలున్
శ్రీశుచిరాంగుఁడీ కనకశేఖరుఁడున్నతకీర్తిఁ గాంచుతన్

(అందరు తథాస్తు అని నిష్క్రమింతురు.)

గద్యము.

సీ. ఏమహామహుఁడు శ్రీవేనునారాధ్య
వంశాంభోధిపూర్ణ శశాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి కెనయైబుధుల్ మెచ్చ
మహిని బాతివ్రత్య మహిమఁ గాంచె
నట్టినందయకు గౌరమకు ద్వితీయ పు
త్రుండఁ గౌండిన్య గోత్రుండ దక్షి
ణామూర్తికిని శివానందంబునకు
సోదరుండఁ గూరిమి యగ్రజుండనుబ్బ

గీ. నార్యునకుఁ బౌత్రుఁడను మనీయమగునట్టి
కనకశౌరీయమను రూపకంబునంగ
నరయఁగా సకలము బంచమాంకమయ్యె
సతము రక్షించు దీనిని జంద్రమౌళి.

# భక్తకబీర్.

గ్రంథకర్త కోడాలి సత్యనారాయణరావు గారు.

భక్తికి మించినవస్తువు యీ లోకమునందేదియు లేదుగదా! భక్తులయొక్క చరిత్రములుగాని, చర్యలుగాని, విని ఆనందించని మనుజుడుండునా? మనుజుడననేల. తద్రసమున శిలలుగరుగును. ఎండిన మోడులు చిగిరించును. ఇంతియగాక సకలరక్షాదక్షుడగు పరమేశ్వరుడే "గోవువెంట దిరుగు కోడెభంగి" అను బమ్మెరపోతనామాత్యుని వాక్యము ప్రకారము సంచరించును. భక్తిరస ప్రధానములగు చరిత్రములు. ఎన్నివిధములుగా ఎవరురచించినను చదివిసంతోషింపని మానవు డెవడుండును. ఈ ముద్దులొలుకు నూతననాటకరాజమున వేదాంత రహస్యములు విపులముగా దెలుపబడినవి. శ్రీరామభక్తుడగు, కబీరునియొక్కయు, శ్రీకృష్ణభక్తుడగు రోహిదాసుయొక్కయు, వాదప్రతివాదములు అమందానంద జనకంబై [illegible]ారు. తత్సందర్భమున వినాయకుడు, కుమారస్వామి, సరస్వతి, పార్వతి, ఈశ్వరుడు మొదలగు దేవతానీకము ప్రత్యక్షమగుటయు, కృష్ణుడే గొప్పవాడనిచెప్పుటయు, శ్రీరామ భక్తుడగు కబీరుదాసువారిమాటల నిరాకరించుటయు, రామకృష్ణులు ప్రత్యక్షమగుటయు మొదలగు నంశము లెంతయు, హృదయరంజకములై యుండు. సందర్భానుసారముగ, భక్తిరసముట్టిపడునటుల, సంకందు, శ్రీరామకర్ణామృతం, శ్రీకృష్ణకర్ణామృతం, భజగోవింద శ్లోకములు చక్కనికీర్తనలు గల్గి ప్రదర్శనయోగ్యముగా నుండును అనేకసమాజముల వారీనాటక ప్రకటమునువివి, పదే పదే వ్రాయుచుండుటచేత శీఘ్రముగా వెలవరించుటకు కారణమైనది గ్రంథకర్త గారికృతిని ఆంధ్రపత్రికాధిపతులగు శ్రీయుత కాశీనాని నాగేశ్వరరావు పంతులుగారికి సమర్పించుటచే గ్రంథప్రశస్తిని వేఱుగమేము వ్రాయనక్కరలేదు. ఆలసించిన ప్రతులుదొరకనేరవు. నేడే జ్ఞప్తి వ్రాయుడు. వెల రు 1-0-0 మాత్రమే

దొరకు వారు:— కే. కే. పట్నాయక్ & బ్రదర్సు,

బుక్కు సెల్లర్సు & పబ్లిషర్సు-ఏలూరు, కృష్ణాజిల్లా.